ఆశ్రమ ప్రచురణము—3.

# శ్రావణము



గొట్టిముక్కల రామకృష్ణశాస్త్రి



# అరుణాశ్రమము

(Publication Department)



లక్ష్యములు.

పవిత్ర సారస్వతోపాసన,

ఉత్తమోత్తమ గ్రంథప్రచురణము,

* * * *

రసిక మహాజనుల

యాదరాభిమానములను

సర్వదా యాకాంక్షింతుము.



# శ్రావణము



గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.



అరుణాశ్రమము
నడకుదురు
కాకినాడ.

# పీఠిక

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

READER IN MUSIC,

**Sri Venkateswara Oriental Institute,**

**TIRUPATI.**

అమృతమయమైన వాల్మీకిరచనాదుగ్ధాంబుధిలోని యొకచిన్న బిందువైన దిండలికథ. ఆనుషంగికముగా వచ్చినది. అదియిప్పుడు శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారి సిద్ధలేఖినీమూలమున స్వతంత్రముగా పెరిగి అన్నివిధములఁ బెద్దదై మనచేతి కందినది.

శ్రీ రామకృష్ణశాస్త్రిగారు ఆయుర్వేదవిద్యాపారీణులు. వైద్యులకు సహజముగా నుండు, ఉండక తప్పని, ఆత్మసంయమమును ఏకాగ్రతయును వీరికి అవధానవిద్యలో ప్రతిఫలించినవి. అట్టిదే యైన ఆర్ద్రహృదయత వీరి కావ్యరచనలో కూలముద్రితమై ప్రసరించినది. ఇందుచేతనే మహాభారతమందలి పాత్రములలో నెల్ల కుంతి వీరి నాకర్షించినది. కుంతీదేవినోరనే ఆమెజీవితమందలి కరుణగాథలు వెలువడి మహాభారత మహావ్యక్తులందఱి చిత్రములును మెఱపులవలె నొక్కొక్కమాఱు తళుక్కున మెఱయించి, ఇన్నిటిలో నడుమ మూలమూర్తిగా ఆదరణీయధీరవ్యక్తిని శాశ్వతముగా అచ్చొత్తినవి. కుంతిని దేవతగా భావించి మనదేశపు పామరులు నోములు నోముచున్నారు. కాని

పండితకవులు- కవిత్రియమును వదలితిమేని- ఎవరును తెలుఁగుదేశమున ఆమెమహాత్త్వమును తగినంత వెలువఱచలేదే యని నాకుండిన నిర్వేద మును శ్రీ శాస్త్రిగారి "కుంతి" పోఁగొట్టినది.

మహాభారతనాటకమున తుదవఱకును సూత్రధారిణియై కుంతి యుండినట్లే ఇంచుమించుగా రామాయణకథకును మూలపాత్రియముగా మునికుమారుని కరుణకథ యున్నది. దశరథుఁడు యౌవరాజ్యపుట జాగ్రత్తతో శబ్దవేధివిద్యాగర్వముతో ఆమునికుమారుని చంపియుండఁ డేని వానితండ్రి శాపమిచ్చియుండఁడు. ఇతఁ డకాలమృత్యువు పాల్పడి యుండఁడు. అరువదివేలయేండ్లు బ్రతికినను దశరథుఁడు చచ్చినది అకాలపుఁజావే, తండ్రి జీవించియే యుండెనేని శ్రీరాముని యరణ్యా వాసపుకథ యెట్లు పరిణమించి యుండెడిదో ! ఆపదునాలుగేండ్లు దశరథుఁడు ఊరక ఇంటిలో కూర్చుండి యేడ్చుచు కడపి యుండఁ డనుట సత్యము.

శ్రీరామాయణమం దీకథ చాల సంగ్రహముగా నున్నది. ముమూర్షువైన దశరథునినోట అంతకన్న విపులముగా విస్తరింపఁజేయు నవివేకి కాదు వాల్మీకిమహాకవి. అసహ్యమై అపారమైన పుత్రవియోగ దుఃఖప్రపంచమున ఈచిన్నకథాఖండము ఆద్యంతము కరుణమయమై నిర్వేదపర్యవసాయియై అతుకుకొనిపోయినది. శ్రీ శాస్త్రిగారు ఆయా వరణమునుండి వెలికి దీనిని దీసి ఈకావ్యమూర్తితో వెలయించినారు, విస్తరించినారు. ఆవిస్తరణపరిస్పందము వింతవింతలుగా నడచినది.

ఈమునికుమారుని పేరేమో వాల్మీకి చెప్పలేదు. కాని శ్రీమద్రామాయణపు పశ్చిమోత్తరశాఖీయపాఠమున చచ్చినకుమా

రుని తల్లి "యజ్ఞదత్త" అని సంబోధించుచు నేడ్చినది. రంగనాథుఁడు ఎక్కడ ఆపాఠమును చూచినాఁడో తెలియదు గాని తనరామాయణ మున అతని కావేకే తల్లినోటనే చెప్పించినాఁడు. తులసీదాసు అతనికి 'సరవన' అని పేరు పెట్టినాఁడు. ఇది 'శ్రమణ' శబ్దపు వికృతి యని, అయోధ్యకు ఇరుగుపొరుగుల బిచ్చగాండ్రు నేఁటికిని ఈకథను పాటగా పాడుకొందురని, బుద్ధజాతకకథ యిట్టిదే యొకటున్నదని, శ్రమణ శబ్దమును బట్టి యీకథ బౌద్ధులసంప్రదాయమునుండి వచ్చి మనలో కలిసియుండవచ్చు నని 'హిందీశబ్దసాగరము' తెలుపుచున్నది. ఇంగ్లీషు లో యీకథను కావ్యముగా వ్రాసిన 'తోరోదత్తు' కవయిత్రి ఈ పేరే వాడిన దని నాజ్ఞాపకము. శ్రవణశబ్దమే శ్రావణశబ్దముగా మాఱిన దేమో! మఱియు దశరథుని వేఁటకు పురికొల్పినది వర్షకాలము– అనగా శ్రావణమాసము. ఈ శ్రావణనామమున కా శ్రావణమాసము ఏ మాత్రమైనను దోహదము చేసిన దేమో !

ఈకథలో గొప్ప చిక్కొకటి ప్రాచీనులకు కలిగినది. ఈ ముని కుమారుని దేజాతి? బ్రాహ్మణుఁ డైనచో దశరథునికి దుర్మోచమైన బ్రహ్మహత్యాపాతకము వచ్చును. శూద్రుఁ డైనచో తపస్సునకును వానప్రస్థవృత్తికిని అధికార ముండదు. ఆతప్పునకే కదా శంబూకుని రాముఁడు దండించినది? కనుక ఈశ్రావణుఁడు– యజ్ఞదత్తుఁడు– రెండు ను అయి రెండును గాని సంకరజాతి కావలసినాఁడు పశ్చిమోత్తర శాఖాపాఠమున బ్రాహ్మణునికి శూద్రికిని జనించినట్లు గలదు. ఎట్లును తల్లిని బట్టి అబ్రాహ్మణత్వము తండ్రినిబట్టి తపోఽధికారమును ముని కుమారునికి కలిగినది. శ్రీ శాస్త్రిగారు ఈసాంకర్యమును తప్పించి తలిదండ్రులిద్దఱిని చక్కని వైశ్యకులమువారినిగానే తీర్చినారు. బ్రహ్మ

హత్య చేసితినే యని దశరథుఁడు భయపడఁగా 'మేము వైశ్యులము కనుక భయపడవలదు' అని శ్రావణుని తండ్రి అతనిని ఇంక దూరార్చి నాఁడు. బ్రహ్మహత్యాపరీక్ష జాతిని బట్టి చేయవలయునా? లేక వృత్తిని బట్టి చేయవలయునా? అన్నది చాల చిక్కైన ప్రశ్న, ఎప్పటికిని తెగ నిది. ఎట్లు చూచినను తొందఱ తప్పదు. వ్యక్తివృత్తినిబట్టి చూచితిమేని జాతినియమముండదు. జాతినిబట్టి నిర్ణయించితిమా వ్యక్తు లెందఱో అనర్హమైన సుఖదుఃఖాల పాలగుదురు. ధర్మన్యాయసూత్రముల యీ పరస్పరవిరోధమే మానవజీవితమందలి యెన్నో విపత్తులకు మూల ము- నాఁటికి నేఁటికి- రేపటికిఁ గూడ.

ఈధర్మన్యాయశాస్త్రములకుఁ జెందిన మఱియొక్క చిక్కు ఈకవిగారి కల్పనలో వచ్చినది. క్షత్రియకన్య ఇందిర ఈవైశ్య ముని కుమారుని వలచి వరించినది. ఆమె తలిదండ్రులు దాని కంగీకరించి నారు. వైశ్యునికిఁగాని బ్రాహ్మణునికిఁగాని శూద్రస్త్రీతోడి వివాహము నిషిద్ధమైనను అనులోమమైనది గావున సహ్యమైనది. కాని క్షత్రియ స్త్రీకి వైశ్యపురుషునితోడి పెండ్లి ప్రతిలోమమై సంఘాంగీకారమును పొందఁగలిగినదికాదు. కవిగారు ఈవిషయము నేమియు చర్చింపలేదు. కాని యిట్టివి సంభావ్యములని, దుశ్చికిత్స్యములని, చదువరులకు చూపి వదలినారు. 'ఇటులెకాదా కామినీవృత్తముల్' (౮౯ పుట) అనుట రేగా వీరి కవివిమర్శ, "కామినీ"శబ్ద ముపలక్షణ మంతే. కాముకులవృత్తము లును ఇట్లే. ఇదేమాటనే "దుఃఖ మిందిరియగణో నివార్యతే" అని చేయి వెల్లకిల వేసినాఁడు. కవిగురువు కాళిదాసు.

శ్రీవణునితల్లిదండ్రులు కడపట చితాగ్ని రగిలించి దానియం దాత్మాహుతి చేసి రని వాల్మీకిరామాయణమున నున్నది. కాని వార ల్లు తనకన్నులయెదుటనే అగ్నిలో దగ్ధ మగుటను చూచుచుండ దశరథుఁ డె ట్లోర్చెను? ఆయబ్రహ్మాణ్యమును వాని కంటఁ గట్టలేక కవిగారు ఇందు వృద్ధదంపతు లిద్దఱను యోగసిద్ధులనుగా తీర్చి వారిచా యోగాగ్నిచే జీవితముఁ ద్యజించినట్లు రచించినారు. దశరథుఁడు చేసి నది చూచినది ఆమృతదేహముల యగ్నిసంస్కారము మాత్రమే.

ఇదేకథను సంగ్రహముగా వ్రాయుచు రఘువంశమున కాళి దాను 'పుత్రశోకముచే మావలె నీవును చావుము'. అన్న మునిశాప మునకు ప్రతిగా దశరథునినోట వినయముతో

"శాపో ప్యదృష్టతనయాననపద్మశోభే
సానుగ్రహో భగవతా మయి పాతితో౽యమ్" (౯, ౮౦)

(స్వామీ! కొడుకుల ముఖపద్మము చూడ నోచుకోనని నాకు మీశాప మే అనుగ్రహమై పుత్రభాగ్యము నిచ్చును.) అనిపించినాఁడు. ఇక్కడ తానిచ్చినశాపమునకు తానే పశ్చాత్తప్తుఁడై వృద్ధముని 'నిస్సంతాన ఖన్నుండవౌ నీపాలన్ వరమౌ నొకప్పు డిది. సందేహమ్ము లే దింత యున్', అని యూరడించి తనవానప్రస్థధర్మమును నిలుపుకొన్నాఁడు 'క్షణకోపాః మహాత్మానః' కదా!

ఇవి శాస్త్రిగారి కల్పనయందలి సూక్ష్మదర్శిత్వమున కుదాహర ణములు. మఱి వెనుకముందులు రెండును లేని వట్టి నడుమంత్రపు

దుర్యోగముగా నున్న యీకథకు వీరు పూర్వోత్తరములను చమత్కారముగాఁ గల్పించి పూర్ణీకరించినారు. కాళిదాసు మేఘసందేశమున సూచించి విడచిన యక్షుని స్వాధికారపరిమత్తత యీకథకు పూర్వరంగమై ఊర్వశీనలకూబరులను భూమికి దించి శాపానుభవము తరువాత వారిని మరల స్వస్థానముఁ జేర్చి వారిపరస్పర పరీరంభముతో ముగియుచు, కవిగారి ప్రతిభాప్రవాహమునకు వలసిన దివ్యభౌమసన్నివేశముల నందిచ్చినది. ఆయా సన్నివేశములను భావములను చిత్రించుటలో కవిగారు చూపిన లోకజ్ఞత, సంయమము, దృష్టివిశాలత, సహృదయత, ధారాళపవిత్రశయ్య, చాల శ్లాఘార్హములు. అవి యీకావ్యమును పలుమారు చదివి మననముచేసి యనుభవించి ఆనందింపవలసినవి. పీఠికలో పునర్వచింపవలసినవి కావు.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ,
నందన కార్తిక కృష్ణ నవమీ
తిరుపతి.



# ని వే ద న ము

"విశ్వశ్రేయః కావ్యమ్"

సహృదయహృదయాహ్లాదజనకమగు కావ్యమునకు పరమలక్ష్యము విశ్వశ్రేయము.

మార్గదర్శకులగు ప్రాచీనమహర్షుల సర్వసిద్ధాంతసారము విశ్వకల్యాణమే. తత్సంతానమగు భారతీయులకు,

"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు" "స్వస్తి ప్రజాభ్యః"

మున్నగు మంగళాశాసనములు పరిపాటి.

ఈ దృష్టియే మహాకవుల కావ్యరచనకు మూలము.

అంశమాత్రముచే నైనను విశ్వశ్రేయము సాధింపఁబడినప్పుడే కావ్యసృష్టి చరితార్థము.

కానిచో నది శుష్కాయాసము.

కాని............

మున్ను విశ్వశ్రేయమునకు సర్వసమ్మతమగు ఒక్కటే రూపము· నేఁడు దానికి వేయి ముఖములు.

ఒకని కభిమతమగు మంగళము వేఱొకని కమంగళము. కాలప్రవాహమున నిట్టి భిన్నవాదములు తప్పవేమో.

ఈసంధ్యాసమయమున కవులపాత్ర క్లిష్టరూపముగా పరిణమించినది.

కవి విశ్వసారథి.

ప్రతిభావంతుఁడగు కవి లోకమును తనయిచ్ఛవచ్చినట్లు తీర్చిదిద్దఁగలడని పెద్దలయభిప్రాయము, అనుభవమును.

కాని......అట్టి ప్రభావశాలియగు మహాకవి నూటికొక్క
డో?—......కోటి కొక్కడో ?......

మనుజునకువలె కవితకును బాల్యయౌవనకౌమారవార్ధకములు తప్పవు. ఉపాసనాబలమున కవిత క్రమపరిణతయై బాల్యయౌవన కౌమారవార్ధకములను గడచి యానందమయము నలౌకికమునగు అవస్థాంతరము నందును.

ఉపాసకుడగు కవి యప్పుడే మహాకవి యగును.

ఆతఁడు తనయమృతవాక్కుచే లోకమును శాసించును. లోకమాతని వాక్యపథము వెంట నడచును.

మనదృష్టిలో నట్టివారు వాల్మీకివ్యాసాదులు, కాళిదాసభవభూతిప్రముఖులు, నన్నయాదులును.

వారు కవితాసిద్ధులు.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

... ... ... ... ...

కవు లెల్లరును సిద్ధులు గారు.

వారిలో చాలమంది ఉపాసకులు మాత్రము.

ప్రతికావ్యము విశ్వశ్రేయమును సాధించుటయు అసంభవము.

అంతమాత్రమున నాకవులును ఆకావ్యములును అనుపాదేయములని చెప్పఁజాలము.

అర్చకుఁడు వివిధకుసుమములతో దైవము నారాధించును.

ఆతనియారాధనలో కొన్ని పూవులు రాజశిరోధార్యము లగును.

కొన్ని నేలపై కాళ్లక్రింద బడి నలిగి తుత్తునియ లగును.

అర్చకునిదృష్టి పూవులపైకంటె ఈశ్వరునిపై, యుపాసనపై గాటముగా తవిలియుండును,

అట్లే కవి తనయుపాసనాపథమున వివిధకావ్యములతో సరస్వతి నారాధించును.

ఆకావ్యములలో కొన్ని లోకాదరము గడించును
మఱికొన్ని చెత్తలై చెదారములై కాలగర్భమున కలిసిపోవును.
ఉపాసకుడగు కవి తనయత్నమున తాను మునిగిపోవును.

... ... ... ... ...

శ్రావణము ఉత్తమోత్తమపితృభక్తిని నిరూపించు పవిత్ర చరిత్రము. పూజ్యులు కీర్తిశేషులు నగు కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారి శ్రావణవిజయము (వచనము) ననుసరించి పలయు మార్పులతో నీకావ్యరచన సాగినది. నా కిట్టికావ్యవస్తువును సమకూర్చిపెట్టిన ఆ సుమరమూర్తికి నాజోహారులు.

దీనిని పురాణాంతర్గతగాథ యని సుబ్బయ్యశాస్త్రిగారొకచో సూచించిరి. కాని నాకు తెలిసినంతవఱకేపురాణాదులయందును దీని మూలము దొరకలేదు. అనంతమగు సారస్వతప్రపంచమున నెచ్చట నైన నున్నదేమో! దీనియంతిమఘట్టము మాత్రము శ్రీమద్రామాయణమున కాన్పించుచున్నది.

"శ్రావణపితృభక్తి" యను నొక గుజరాతునాటక మున్నట్లు మహాత్ముని యాత్మకథలో చదివితిని. విశ్వప్రయత్నము చేసినను అది లభింపలేదు. తుదకు శ్రావణవిజయమే నాకావ్యమునకు మాతృక యయ్యెను.

కోరినంతనే యమూల్యమగు పీఠిక వ్రాసి నా కావ్యముపై ననుగ్రహము నెఱపిన శ్రీదాశ్లపల్లి అనంతకృష్ణశర్మగారి మధురవాత్సల్యమును సర్వదా హృదయమున నారాధింతును.

ఈ రచనలో మిక్కిలి తోడ్పడిన మిత్రులెల్లరకు నా కృతజ్ఞత.

అయాచితముగా నీకావ్యముద్రణమునకు ధనసాహాయ్య మొనరించి నన్నాదరించిన శ్రీ రెడ్డిపల్లి సర్వారాయుడుగారి యౌదార్యము మఱువరానిది.

మిక్కిలిశ్రద్ధతో దీనిని ముద్రించి చక్కనిరూపము సవరించిన ప్రభాత ముద్రణాలయాధిపతి చిరంజీవి నామన లక్ష్మణనాయనికి నా యాశీస్సులు.

నిరంతరమగు నాయనారోగ్యమునను అవ్యవధానమునను రచనా ప్రమాదములు ముద్రాప్రమాదములు నెన్నో దొరలియుండును. సహృదయులు క్షమింతురుగాక.

అరుణాశ్రమము,
నడకుదురు.
1—2—53.

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.

# కృతజ్ఞత

శ్రీయు ననామయంబు బుధశిష్టజనోచితవర్తనంబు దీ
ర్ఘాయువు మిత్రబాంధవసమాదరమున్ హరిదంతసంతతా
మేయయశమ్ముఁ గూర్చి యెలమిన్ గరుణించును సర్వరాయ! ని
న్నాయతరెడ్డిపల్లివిమలాన్వయు మారఘుదేవుఁ డెప్పుడున్.

తలిదండ్రులైన సీతన్నయు భావనాం
బయు స్వర్గతులు తృప్తిపడసి మురియ,
శ్వశురులు తుమ్మలపల్లి వెంకటరత్న
మమ్మనాంబయును బ్రహర్ష మంద,
అన్న గురయ్య నారాయణరావును
ననుజుఁడు సత్తిరా జనుమతింప,
ఆర్యచరిత్ర మహాసాధ్వి సత్తెమ్మ
యర్ధాంగి యానుకూల్యంబు జూప

రెడ్డిపల్ల్యన్వయము పవిత్రితము గాఁగ,
బంధుమిత్రులు పొగడ, విద్వత్కవీంద్ర
గణము లగ్గింప, నౌదార్యగరిమ మీఱ,
నామహాకృతి వెలయించినాఁడ వీవు.

అతిభక్తిన్ పితృపాదపంకజసపర్యం జేయ యత్నించు నా
కతిశక్తిన్ సమకూర్చినాఁడవు— మదీయం బైనకావ్యంబు ము
ద్రితముం జేసితి వి ట్లుదారగుణవర్ధిష్ణుండవై— దీన వి
స్తృతమౌ నీపితృభక్తియున్ బ్రథిత మయ్యెన్ మిత్రచూడామణీ!

కృతులను స్వీకరించి కవికిన్ విపులార్థచయమ్ములన్ బహూ
కృతి యొనరించునట్టి సుచరిత్రు లసంఖ్యాత నుంద్రుగా, కిటుల్
కృతి నితరార్పితమ్ము నొనరించిన మాదృశుఁ గూడ మేటిస
త్కృతిఁ దనియించు ధన్యత మహీస్థలిఁ గాంచితి వీ వొకండవే.

నీవలె కావ్యసంపద గణించి కవీంద్రుల గౌరవించు స
ద్భావము నేటి కొక్క ధనవంతునకైన జనించియున్నచో
ఈవఱ కెన్నఁడో జగము లేలకయుండునె తెల్గుకైత?— యాం
ధ్రావని పూర్వవైభవము నందకయుండునె విశ్వసాహితిన్?

---

# ప్రసూనాంజలి.

శ్రీమహితాత్మలార! ప్రేమసంపిక్తులార!
ధన్యగుణులార! రత్నమాంబానృసింహ
ప్రకటశుభనాములార! ధీభరితులార!
ధర్మనిధులార! నాతలిదండ్రులార!

కని నిత్యవాత్సల్యగరిమ నింపారంగ
ప్రాణమ్ములట్లు కాపాడి పెంచి
ఆర్యసంస్కృతికి వంశాచారవైఖరి
కనువైన సాంప్రదాయముల నేర్పి
చిన్నమాటలఁ గథల్ చెప్పుచు లోకవృ
త్తమ్ముల నుచితపద్ధతులఁ గఱపి
ఆత్మాభిలషితవిద్యాభ్యాస మొనరింప
వలసినంతగ వీలు కలుగఁ జేసి

మేము మోయంగఁ దగినట్టి మేటిబరువు
ముదిమిలోఁ గూడ మీరలే మోసిమోసి
పరిఢవిల్లెడు పుణ్యదంపతులు మీరు
ఏమి చేసిన మీఋణం బెట్లు తీఱు?

మీవాత్సల్యమహానుభూతిఁ గొని భూమి న్నేఁటి కేవంవిధ
శ్రీవర్ధిష్ణుల మైతి—మింక భవదాశీర్వాదభాగ్యంబె మా
యావజ్జీవితరక్షకం బగుట తథ్యం, బెందు మీకల్ వినా
దైవం బన్యము లేదు మా—కిదియె సిద్ధాంతంబు ముమ్మాటికిన్.

పూని మీపూజకై కావ్యపుష్ప మొకటి
తెచ్చియున్నార — మది మీర లిచ్చినట్టి
సాహితీక్షేత్రమందు విశ్వప్రసిద్ధ
సౌరభమ్మునఁ బుక్కి శాశ్వతిక మగుచు.

నవకావ్యప్రసూనోపహార మిది విన్నాణంబుగాఁ గీర్తిగా
రసంపత్సముపేతమై విపులభారద్వాజసద్గోత్రమై
భవదాసంబయి యస్మదన్వయయశఃప్రాశస్త్యసంస్థానమై
యవనిన్ వర్ధిలున్మ్ము చేకొనుఁడు పూర్ణామోద మేపారఁగన్.



# కృతిపతులు



గొట్టుముక్కల

నరసింహాంగారు. రత్నమాంబగారు.

శ్రీరామాయనమః

# శ్రావణము.

(నాంది — ప్రస్తావన)

శ్రీసౌందర్యకళాసమంచితమహాచిన్మూర్తి యార్తావన
వ్యాసంగుండు దిశాంతరప్రథితభాస్వత్కీర్తివిస్ఫూర్తి ప్ర
జ్ఞాసౌశీల్యనివాసభూమి పితృపూజాదీక్షితుం డార్యసే
వాసంతుష్టుఁడు రాఘవేశ్వరుఁడు విశ్వశ్రేయముల్ గూర్చుతన్.

సీతాలక్ష్మణకృప్తపార్శ్వము వదశ్రీనిత్యసంసేవన
ప్రీతప్రీతసమీరనందన మతంద్రీభూతతూణీధను
స్స్ఫీతాపీనభుజాగ్రపీఠము జగద్విఖ్యాత మంత్రస్ముఖో
ద్గీతామేయశుభస్వరూపము లసత్తేజం బుపాసించెదన్.

వాల్మీకిమానిజిహ్వాప్రదేశము నిజ
ప్రథమావతారతీర్థంబు గాఁగ,
బాదరాయణదివ్యభావసౌధము నిజ
నిత్యనివాసమందిరము గాఁగ,
కాళిదాసాదిసత్కావ్యసూక్తులు నిజ
రమణీయమణిమండనములు గాఁగ,
నన్నయాదికకళాభ్యున్నతశ్రీ నిజాఽ
మ్లానమంజులసుమమాల గాఁగ

నవ్యకవిరాజకృతిసమామ్నాయ మెల్ల
తనకు మురిపెంపునిల్వుటద్దంబు గాఁగ
వెలయు భాషావధూటిని దలఁచి యామె
పద ముపాసింతు శబ్దసంపదలు పొదల.

కవితోపాసనలో మునింగి జగతీకల్యాణసంభావనా
ప్రవణత్వమ్మున సాధుజీవనము నిర్వర్తించుచున్ తృప్తులై
స్తవనీయప్రతిభాప్రపూర్ణరచనాసంసిద్ధులై మించు ప్రా
జ్ఞవవిద్వత్కవిసార్వభౌములఁ బ్రశాంతస్వాంతులం గొల్చెదన్.

ప్రాచీనాద్యతనప్రభూతకవితాపారంపరీతత్త్వచిం
తాచాతుర్య, మలౌకికప్రతిభ, శాస్త్రజ్ఞానసాహిత్యసా
మీచీన్యమ్మును ధన్యులై పడసి నెమ్మిన్ కావ్యనిర్మాణమున్
ప్రాచుర్యమ్మునఁ జేయుసత్కవుల సంభావించి భావించెదన్.

ఉర్వీ నవవంనవామృతరసోజ్జ్వలభావము లైన కావ్యముల్
సర్వజనాదరం బెనయ శాశ్వతికస్థితి నందు— ధర్మమున్
నిర్వహణం బొనర్చు— నవినీతి నడంచును— విశ్వభద్రముల్
పర్వఁగఁజేయు— నట్టికృతులన్ గృతికర్తల సంస్తుతించెదన్.

ప్రాభవవైఖరుల్ విపులభావస్ఫ్రష్టత త్త్రదసో
చితశబ్దస్ఫురణంబు మంజులకథాశ్రీచిత్రణం బేకని
ష్ఠత భాసించినకావ్య మొక్కటియె విశ్వస్తుత్యరూపమ్మునన్
ప్రతిభాసించును— తక్కుఁబొత్తములు పుబ్బన్ బుట్టు, మాఁడున్ మఖన్.

కాలము మాఱె, కావ్యపరికల్పన మాఱెఁ, గవిత్వవైఖరుల్
చాలఁగ మాఱెఁ, దద్రసవిచారణపద్ధతి మాఱె, సర్వమున్
కూలము ముట్ట మాఱె, ననఁగూడదు గాని దరిద్రమూర్తులై
మూలల గ్రుగ్గుచున్న కవిపుత్రుల భాగ్యమె మాఱ దింతకున్.

ఏదే నొక్కకృతిన్ రచింప మనసై యేతత్కథాన్వీక్షణ
ప్రాదుర్భూతపటుప్రమోదమున నారంభించితిం దీని, వి
ద్యాదర్పమ్మును గాదు కీర్తిధనబద్ధశ్రద్ధయుం గాదు, భా
షా దేవీచరణాబ్జసేవ పితృపూజాతృప్తి నాలక్ష్యముల్.

కవులు కావ్యమ్ములను వ్రాయఁగలరు గాని
యెన్ని చదలంటునో మహాదృష్టగరిమ?
నెన్ని చెదలంటునో దురదృష్టమహిమ?
నెవరు చూతురు—? కాలమే యెఱుఁగు దాని.

కాన భవిష్యదర్థములకై మతిమాలిన శుష్కయత్నముల్
మాని స్వశక్తిమై సరసమంజులశబ్దమనోజ్ఞభావస
న్మానితదివ్యకావ్యరచనల్ పచరించుట యొక్కటే కవీ
శానులకర్మ మౌ— రసికసంఘము తీర్చు భవిష్యదర్థముల్.

పౌత్రుఁడ సర్వసంభావితవెంకమాంం
బాసుబ్బరాయదంపతుల కెలమి,
దౌహిత్రుఁడ నితాంతధన్య "గుం"ట్వాన్వయ
శాయమ్మ పాపయ్యశాస్త్రులకును,

పుత్రుఁడ విశ్వపవిత్రరత్నాంబికా
నరసింహనామ కోన్నతగుణులకు,
అనుజుఁడ సాంగాయురాగమవేదిను
బ్రహ్మణ్యశాస్త్రి విద్వద్వరునకు,

అగ్రజుండను సూర్యనారాయణునకు
నటులె పాపయ్యశాస్త్రికి నాంజనేయ
సత్యనారాయణులకు ధీసన్నుతులకు
సుజనకలితాశ్వలాయన సూత్రికుఁడను.

ఊరు నడకుదురు గోదా
వరితీరస్థంబు— ఋషియు భారద్వాజుం
డారయఁగ గొట్టుముక్కల
వారల— మే రామకృష్ణపదభాసురుఁడన్.

వైదికవిద్యలన్ బులుసువంశపవిత్రుఁడు కామశాస్త్రి నా
కాదృతిమై యొసంగెను— మహామతి మేడవరంపు చిట్టెనా
ఖ్యాధృతకీర్తి సంస్కృతమునందు ప్రవేశమొసంగె— సర్వవి
ద్యాధికగుండులక్ష్మణబుధాగ్రణి నాఁటెఁ గవిత్వబీజమున్.

హితమత ధూళిపాళసుకులేడ్యచరిత్రుఁడు సోమనాథపం
డితుఁడును వంకరత్తపమనీషివరేణ్యుఁడుఁ గావ్యనాటకా
ద్యతులితసాహితీమయనవామృత మింత యనుగ్రహించి యీ
క్షితి విబుధుం బొనర్చిరి విశేషకృపాభరితాంతరంగులై.

ఆయతమర్లవంశకలశాంబుధిచంద్రములు నారసింహనా
రాయణశాస్త్రిసోదరులు వ్యాకరణమ్మును తర్కసాంఖ్యవి
ద్యాయుత మాయురాగమము నాదృతి మీఱ ననుగ్రహించుచున్
నాయెడఁ బుత్రభావము ననారతమున్ నెలయించి రెంతయున్.

తత్తద్గురు గురు కరుణో
పాత్తకళావైభవుండనై సహజరసో
దాత్త శుభకావ్యరచనా
యత్తమనస్కుండనై ప్రహర్షముతోడన్.

అనుదారన్ బితృపాదపంకజసపర్యాలక్షితం బైన సు
దరచారిత్రము గావ్యరూపమున సంధానించి విద్వత్సమా
దరణీయమ్ముఁ బవిత్రమై తనరు తత్కావ్యప్రసూనోత్తమం
బరుదారన్ బితృపాదపంకజసపర్యార్థంబె యోజించెదన్.

శ్రీరామాయనమః

# శ్రావణము



## పూర్వఖండము



శివసుహృత్పాలితము సురసిద్ధసాధ్య
యక్షకిన్నరమిథునసమాశ్రితంబు
మంజుసుమమంజరీపుంజమధురగంధ
మానితము చైత్రరథమహోద్యాన వాటిక.

అచటి భూములు రత్ననిచితంబులై కళా
లలితంబులై తళత్తళల నొలయు
అచటి వృక్షములు కాలానుబంధము లేక
ప్రసవించు బంగారుపండ్ల నెపుడు,
అచటి తీవలు కఠోరాతపమ్మునకైన
వాడని పుష్పసంపదల మించు
అట సరోవరము లెప్పటికప్పు డిందువి
చ్యుతసుధాపూరసంగతిఁ దనర్చు.

అచటి శాద్వలములు జలయంత్రములును
కుసుమపరిపూర్ణకేళీనికుంజములును
సతత మతిలోకవైభవోన్నతము లగుచు
తనువు మఱపించు నెంతధీరునకునైన.

## శాప వర్ణనము.

అది యలకాపురీసవిధమందుఁ గుబేరుని పాలనమ్మునన్
బొదలుచు నిత్యపుష్పపరపుష్పవధూకులకాకలిస్వనా
భ్యుదయసమంచితం బమరయోషిదనూనతరోత్సవార్భటీ
సదనమునై యెసంగు నతిసంభృతకామకళాకలాపమై.

భవ్యశృంగారపదపట్టభద్రులైన
యక్షదంపతు లామహోద్యానమందు
కరముఁ గరమునఁ గీలించి కరము వేడ్క
మందగతి మీఱు విహరించుచుందురెపుడు.

ఒకశివరాత్రినాఁడు వెస నుగ్రమయూఖుఁడు పశ్చిమాబ్ధిఁ గ్రుం
కకమును సంజకెంజిగురుకాంతులు చిక్కగ మింటిపైనఁ దో
పకమును చల్లఁగా మలయమారుతము వీచి విహారమేగు కో
రిక యువచిత్తభూమి నమరించు ప్రశాంతదినాంతమందొగిన్.

రంభాదులగు నచ్చరల మేటిసౌందర్య
మనుభవింపఁగ గుత్తఁగొనినవాఁడు,
తఱుఁగని యౌవనధనముచే నొకపాటి
బరువైన మేనివైభవమువాఁడు,
బ్రదుకుట స్త్రీపరిష్వంగమాత్రమునకే
యనునట్టి దృఢనిశ్చయంబువాఁడు,
యౌవనసుఖముమం దన్యము నూహింపఁ
జాలని నూఁగుమీసాలవాఁడు,

## పూర్వఖండము.

ఆటపాటలలోఁ బ్రొద్దు లనవరతము
గడిపికొనివచ్చునట్టి విలాసమూర్తి
యక్షసామ్రాజ్యయౌవరాజ్యాభిషేక
కుశలజీవనుఁడౌ నలకూబరుండు.

లలితాపాంగముమాత్రనే భువనజాలంబెల్ల గద్గోలుగా
నలుపంజాలిన సుందరీమణి విలాసప్రౌఢ గాంధర్వకా
కళలసమ్మానితదివ్యనర్తనకళాసర్వజ్ఞ యా నూర్వశీ
లలనారత్నము నవ్వుచున్ బ్రణయ మొల్కన్ వెంటఁ దోతెంపఁగన్.

జిలిబిలితీవపందిరుల చెంగటఁ బచ్చని శాద్వలమ్ములం
దలసుల సెజ్జలందు వికచాబ్జపరీమళభాసురంబులౌ
కొలనుల చెంత సుంత మితిఁ గోరని కోరికతో విహారమున్
సలుపఁగ వచ్చె మందపవనం బెదురై కడు సందడింపఁగన్.

లేమావిగున్న లాలింప నాలాపించె
మదపికం బొక పంచమస్వరంబు,
దళమైన కాదంబముల నీడ నొక కేకి
యానందముగ నాట్యమాడఁ దొడఁగె,
దాడిమశాఖాస్థితంబైన యొక చిల్క
కలరీతి మధుగీతికలను పాడె,
చిఱుగాలి కొక్కింత శిరము వంచిన యొక
లతకూన పూవుటారతుల నెత్తె,

శారి వ ణ ము.

వృక్షములు జల్లె సుమమంగళాక్షతముల
భ్రమరసంతతి సామమంత్రములఁ జదివె,
నాఁడు నలకూబరాగమనప్రభూత
ముదముచేఁ దోఁటయెల్ల నుప్పొంగిపోయె.

ఆనలకూబరుండు సమరాంగసయున్ సుమసౌరభప్రభా
వానుభవోల్లసత్ప్రణయభావవశంవదులై సుస్మిత
శ్రీనవమోహనాకృతివిశేషములొప్పఁ గ్రమానుబద్ధముల్
గాని, నుమల్ నడల్ వెలయఁగా విహరించిరి తద్వనస్థలిల్.

పరిసవైకపాత్రాసవము ననురక్తి నా
స్వాదించు భ్రమరదంపతుల నగసి
స్పర్శసుఖానుభవమ్ముఁ గన్నులఁ దోప
మేతమూసిన మృగమిథున మరసి,
ఒక లెఱుంగని ప్రేమ నొండొరు గండూష
జల మందికొను నేన్గుజంట నరసి,
అర్ధోపభుక్తబిసాంకూరవినిమయో
ద్యోగనిర్భరహంసయుగళి మరసి,

సతతగీతపరిశ్రమోద్గతములైన
చెమ్మటలు మీఱ మద్యగంధమ్ము దెసల
గుబురుకొన స్వేచ్ఛమై ముద్దుఁగొనుచు నలకు
దేవయోనియుగంబుల తీరు లరసి.

పూర్వ ఖండము.

భావగర్భితసుమధురాపాంగదీప్తు
లెగయ మొగముల ముసిముసినగవు నెగడ
చిరతరోపాసితప్రేమ సిద్ధులగుచుఁ
దొడరి విహరించి రా పువ్వుఁదోఁటయందు,

ఒడలు నొడల్ సతం బొరయుచుండ దృఢంబగు బాహుబంధనం
బడరఁగ స్పర్శనిర్వృతి యనంతముగా సకలేంద్రియంబులం
బొడమఁగ సాత్త్వికోదయవిముగ్ధవిలోచనులై క్రమంబుగా
నడచిరి పూవుపూవునఁ గనంబడు క్రొత్తఁదనంబు మెచ్చుచున్.

నవమంజరులు మహోత్సవమున వారికి
నవతంసభావంబు నధిగమించె,
మల్లిక లవిరళోత్ఫుల్లంబులగుచుఁ ద
త్పథములఁ బరువంపు పసుపుఁ బఱచె,
విరజాజు లామోదభరితంబు లగుచుఁ ద
త్సైకతశయ్యసంపదలఁ జక్కఁగ దిద్దె,
వకుళంబు లరుణపరిభాపూర ములయఁ ద
త్కమనీయకంఠభాగముల నమరె,

మందచలమాననవపవమాన మఖిల
పుష్పసౌరభసంపదల్ పుణికి తెచ్చి
వెంటవెంటనె నడచి సేవింప వారు
వేడ్కఁ విహరించి రా వనీవీథులందు.

శ్రావణము.

వారు చనఁజన నేత్రపర్వంబుగాగ
సకలశాఖాప్రశాఖికావికచకుసుమ
కిసలయశ్రీలు తోఁట నల్దెసలం గ్రమ్మ
నందివర్ధన మొండు గన్పడియె నెదుట.

మూఁతలులేని కన్ను లరమూసి చిరప్రచురోత్సవం బను
స్యూతము గాగ రాగమయి యూర్వశి తత్కుసుమోపజాతహా
కౌతుక ముప్పతిల్ల నిజకాంతుని నల్లనఁ గౌగిలించి వే
రీతుల వేడె నాత్మకబరీప్రతిసాధనకాంక్షఁ దెల్పుచున్.

ఆ నలకూబరుండును రయంబున నూర్వశియాజ్ఞ నొదలం
బూనుచు నందివర్ధనపుఁ బూవులఁ గోయఁ గడంగునంత ను
ద్యానవియుక్తరక్షకభటాధిపుఁ డొక్కఁడు కేలుమోడ్చుచున్
నేను వడంక నాతని సమీపము మెల్లనఁ జేరి యిట్లనెన్.

ఓ రసికాగ్రణీ! మనవియొక్కటి మీరలు సాహసించి యీ
తీరున దీనిపూవులను ద్రెంపగఁ బోకుడు-రాజరాజు "నేఁ
డేరినిఁ గోయనీయవల దీపువు" లంచును మాకు నాజ్ఞగా
ధీరత శాసనమ్మును విధించుట మీరును వింటిరేగదా?.

నేఁడు శివరాత్రి - ఉపవాసనియతి చంద్ర
ధరునిపూజకు నందివర్ధనసుమముల
స్వయముగాఁ గోయ మీతండ్రి వచ్చు నిటకు
మీరు శృంగారనిధు లిందు మెలఁగరాదు.

## పూర్వ ఖండము.

మీ సరదాల నిట్లు విషమింపఁగఁ జేసితి నంచు నాపయిన్
రోసము మాను మో సుగుణరూప! భవజ్జనకుండు సేయు నా
శాసన మన్యథాగతిని సల్పుట సౌఖ్యకరంబుగాదు – నే
దాసుఁడ స్వామియాజ్ఞకును దప్పనివాఁడ ననుగ్రహింపుమీ.

కింకరుఁడైన యొక్కఁడు సఖీశుభసన్నిధియందుఁ దన్నిటుల్
గొంకక నిల్వరింప నలకూబరుఁ డెంతయుఁ గ్రోధమూర్తియై
"కంక! మదించి మైమఱచి కూయకురా, యిట నాకుఁగూడ నా
టంకమె?" యంచు వాని దవుడల్ పగులన్ ప్రహరించి పిమ్మటన్.

సమధికోత్సాహమున వృక్షశాఖ నెక్కి
అందుఁ దనహస్తమున కందినన్ని పూలఁ
గోసి దిగివచ్చి ప్రేయసీకుంతలముల
మోహపరవశభావుఁడై ముడుచుచుండ.

డంబుమీఱఁగఁ బట్టుపుట్టంబుఁ దాల్చి
మదిని నవిరామముగ "నోంనమశ్శివాయ"
యనెడి మంత్రము జపియించుకొనుచు ధనదుఁ
డచటఁ బూసజ్జతోడఁ బ్రత్యక్షమయ్యె.

ఆ మహితాత్మురాకఁ గనినంతనె సంభ్రమ మంది ధూర్తులా
కాముకు లింతమాత్ర మెడగాఁ జని మోముల వ్రాల్చి వ్రేళ్లతో
భూమి లిఖించుకొంచు భయముద్రితులై యదురంగ గుండియల్
"ప్రేమపిపాస హేయ" మనిపింపఁగ నిల్చిరి నిశ్చలాంగులై.

# శ్రావణము.

తన కొడు కిట్లు కామపరతంత్రిత వేశ్యల వెంటనంటి యా
వనమున భక్తిమాని యుపవాసము మాని నిజాజ్ఞ సైతమున్
పనిగొని ధిక్కరించుచు శుభప్రసవంబులఁ గామినీప్రసా
ధనవిధి రిత్తపుచ్చెడు విధమ్మును జూచి కుబేరుఁ డుగ్రుఁడై.

అచట నొకమూల భయపరీతాత్ముఁడగుచు
నొదిగిపడియున్న రక్షకోద్యోగి వంక
నొక్కపరి జూడ, నాతఁడు నుల్కిపడుచు
వినయ వినమితుఁడై యిట్లు విన్నవించె.

"స్వామి! మన్నింపుఁడయ్య! మీ శాసనంబు
వేయివిధముల వీరికి విన్నవించి
నాఁడ నద్దాని ఫలితంబుఁజూడు డిదిగో
ఇంక నా చెంపపై తట్టు లింక లేదు".

ఆ నుడులు విన్నయంత రక్తాక్షుఁ డగుచు
మేను పొంగఁగఁ బెదవి కంపించుచుండ
సుతుని మొగమున నుగ్రదృష్టులఁ బఱపుచు
నిట్లనియెఁ దీవ్రముగ గుహ్యకేశ్వరుండు.

ఏమిచేసితి విచట నర్ధేందుమౌళి
పూజకై నిల్వయుంచిన పుష్పములను
ఎంచి ప్రియురాలి జడల కెక్కించినావు
తగునె మతిహీనుఁడా యింత పొగరు నీకు?

## పూర్వ ఖండము.

వారవధూజనాంతరనివాసమె లోకముగాగ నెన్ని నా
ళ్ళీ రసికత్వమున్ వెలుఁగనిత్తువు? పావన శైవవాసరా
చారము మీఱి కోరి పితృశాసనమున్ వితథీకరించు నీ
ధోరణి కేమిజెప్పెదవు? ధూర్తుఁడ! యెంతని సైపఁజాలుదున్?

"బాలుని యౌవనంపుగోడవల్ మన" కేమను నాయుపేక్ష మే
ల్మే లనిపింప నింత మితిమీఱి తెగించితి వెల్లకాల మీ
కూళతనంబు సాగుననుకొంటివె తుంటరి! తుచ్ఛకామినీ
లోలతఁజిక్కి ధర్మము విలుప్త మొనర్చితి వోరి దుర్మతీ!"

ఎందఱున్నారు మనవీటియందు నీదు
వయసువారలు? వాడ నీపగిది నిట్టు
లాడలు దెలియక వేశ్యల యొడులలోనె
మసలుచున్నారె విధివిరామములు లేక.

కుమతి! శివార్చనమ్ముకొఱకుం దగుపూవులఁ గామవృత్తి న
క్రమమునఁ బాడుజేసితివి - కావలివానిని గొట్టి మమ్ముసై
తమును దిరస్కరించితివి - తదాజ్ఞల కిట్టి స్వయంకృతాపరా
ధముల నుపేక్షఁజేయుట యధర్మము - నిన్విడువంగరా దిటన్.

పొమ్ము నీ హద్దులేని స్త్రీమోహ మింత
సాగిరానీని యాతనాజలధిలోన
మునిఁగి తేలుచు సుఖపరిస్ఫూర్తి లేక
జగతి జనియింపు మొక బ్రహ్మచారి వగుచు.

అని శపియించి యక్షవిభుఁ డల్లన నూర్వశిఁ జూచి యిట్లనెన్
"వనితరో? నీవు వీనిసహవాసముచేఁ జెడినావు నేఁడు— నీ
మునుపటి శైవభక్తి యెటఁబోయిన దిట్టి శివాపచారముం
బొనరిచినంత నూరక యె పోవునటంచుఁ దలంచినావొకో.

భూమ్మి జనియింపు మొకరాజపుత్రి వగుచు
వసుధ ననురూపభర్తృలాభంబు లేక
యౌవనం బెల్ల వ్యర్థమై పోవునట్లు
కన్యకవుగానె యుందువుగాక చిరము."

పిడుగ గడచినట్లు శిరమునఁ బడినయట్టి
ఘోరశాపమ్ముచే నలకూబరుండు
నూర్వశియు హా! యటంచు నత్యుగ్రశోక
వివశులై యార్చి మూర్ఛిల్లి యవనిఁ బడిరి.

"ఈసరి కెట్టి తప్పిదములేని యొనర్చినవాఁడఁ గాను తం
డ్రీ! సవరింపు మీసుతునినేరము— యౌవనగర్వ మెవ్విధిన్
దోసములందు బల్మిఁ బడఁద్రోయునొ నా కనుభూతమయ్యె నేఁ
డో సుగుణాంబుధీ! కరుణ యుంచుము పోయెద శాపదుర్గతిన్.

ఇంత యపరాధినై క్షమియింపుఁ డనుచు
నడుగ నోరాడ దీశిక్ష వడెద నింక
స్వామి! ని న్వీడి చిర ముండఁజాల నేను
వేగ శాపాంతము నొసంగవే కృపాళు!.

అని నలకూబరుం డవనతాననుండై బతిమాలుచుండ నా
ధనదుండు కోపమెల్ల దిగంద్రావి ప్రసన్నత దోప నిట్లనెన్
"ఘనగిరిశాపచారము నొనర్చితివో యవివేకి! యిట్టి దు
ర్వినయఫలంబు నీ కనుభవింపక తీరదు నిశ్చయంబుగా.

తెలిసి నీతప్పు నీవు గుర్తించి మిగుల
వగచుచున్నావు మెచ్చితి వలదుచింత
పొమ్ము దశరథశరవిద్ధమూర్తి వగుచు
తిరిగి పూర్వస్వరూప మందెదవు నీవు.

ఊర్వశీ! పూర్వతను వీతం డొందు వెనుక
నితనిమరణంబు దలంచుచు నేడ్చియేడ్చి
జీవితము రోసి యగ్గిపాల్జేసి నేను
నిజశరీరముం గాంతువు నీవుం గూడ.

అని నిధినాథుం డీశ్వరమహామహిమంబుం దలంచుకొంచుం దాం
జనిన క్షణోపకల్పితవిచారభరమ్మునం గుంగికుంగి యా
ననముల వాల్చి మందగమనమ్ములతోం బువ్వుం దోంటం దాటి య
ల్లన నలకూబరుండును విలాసినియుం బయనించి రేడకో.

తరువుల సుడులచేం దలక్రిందుం జేయుచు
విలయమారుతము హో రెత్తసాగె
తనలోని పూలు జిందరవందరలు గాగం
గ్రీడాసరస్సు ఘూర్ణిల్లం జొచ్చె

## శ్రావణము.

శుకసారికాదిపక్షులు గొంతు లెత్తక
ప్రాణాల నరచేతఁ బట్టియుండె
తీవకన్నెలు భయోద్వేగాన వడకుచు
చాపచుట్టుగ ధరాస్థలిని వ్రాలె.

మధుపిపాసను సైతము మఱచిపోయి
కొదమతుమ్మెద లొకమూల కొదిగిపోయె
ప్రకృతి తన నీలకబరీభరమ్ము విప్పి
"తెయ్యి" మని గుండె లదుర నర్తింప సాగ.

---

శ్రీదముల సర్వసౌఖ్యా
పాదకములఁ దలఁతు భక్తవాంఛిత నిత్యా
మోదకముల రఘుపుంగవ
పాదకమలముల నిరస్తభయఖేదములన్.

శ్రీరామాయనమః

# శ్రావణము

## మధ్యమఖండము.



### మొదటి సర్గము.

మును భూమండనమై సమస్తవిభవస్ఫూర్తిన్ విజృంభించి నూ
తనసౌందర్యమహాసమృద్ధిఁ గని విద్వల్లోకసంవాసమై
ఘనధర్మాసనమై నిరంతరకళాకల్పద్రుమంబై జగ
ద్వినుతంబై మధురాపురంబు వెలయున్ దేదీప్యమానాకృతిన్.

అవి పదత్రితయంబుతో నవని ధర్మ
దేవత చరించి విజయ మందిన దినాలు
సత్యము నహింస పరమలక్ష్యంబు లగుచు
కరము సాధింపఁబడిన బంగరు దినాలు.

బాడబుల్ దమయగ్రవర్ణగౌరవమును
భావించుకొని పొంగిపోవలేదు
క్షత్రియుల్ రాజ్యాధికారగర్వమ్మున
నొడలెఱుంగక గంతు లిడఁగలేదు
వైశ్యులు కృషిలబ్ధవైభవాన్వితు లయ్యు
ధనమదమ్మున నింత తన్రలేదు
శూద్రులు జ్ఞానసముద్రు లయ్యును నైజ
భావమ్మునకుఁ జింత పడఁగలేదు

శా్రివణము.

వారు వారును నొక కుటుంబమ్ములోని
వారువలె నెట్టి ద్వేషభావములు లేక
స్వీయధర్మప్రవృత్తిచే సృష్టి నమృత
రూపముగఁ జేసికొనిన మేల్ పౌ్రిద్దు లవ్వి.

ఆ కాలమ్మున నాపురీతిలకమం దత్యంతభాగ్యాన్వితుం
డాకల్యాణగుణాంచితుం డతిథిపూజైకక్రియాతత్పరుం
డాకల్పప్రథమానదానవిభవుం డావాసముంజేయు సు
శ్లోకగ్రామణి "విశ్వనాథుఁ" డను వైశ్యుండొండు ధర్మాత్ముఁడై.

అతని యిల్లాలు మధురమృష్టాన్నదాన
విశ్వవిఖ్యాతచరిత సాధ్వీలలామ
అంచితవిధాన "యన్నపూర్ణా"భిధాన
అన్నపూర్ణాసమాన నిత్యాన్నపూర్ణ.

అతనియడుఁగుల గడియసేపైన విడిచె
నేని యామెకు చైతన్య మెగసిపోవు
ఆమెకోమలదేహ మింతైనఁ గందె
నేని యాతని హృదయంబు మాడ్రినువడును.

చేయిమున్గినసిరిగల చేడె యయ్యు
నామె యాసింప దొక నగ నైన నెపుడు
తఱుఁగని ధనంపుఁ బెత్తనదారుఁ డయ్యు
నతఁడు మనసుంచఁ డెట్టి సౌఖ్యములనైన.

## మధ్యమ ఖండము.

ఆమెపని రేపుమాపు నన్నాతురులకు
షడ్రసోపేతమైన భోజనము నిడుట
అతనిపని వారి కితరవాంఛితము లెల్లఁ
దీఱ గోభూమికాంచనాదికము లిడుట.

వారిశీలంబు మెచ్చని వారు లేరు
వారి యన్నంబు గుడువని వారు లేరు
వారిపూజల నందని వారు లేరు
వారి నెఱుఁగని వారలు లేరు లేరు.

కర మనురక్తి వారు చిరకాలము సాధుజనార్చనక్రియా
దకులు నుదారులున్ బరహితప్రవణుల్ బరిపూర్ణభక్తిత
త్పరులు పరస్పరప్రణయబద్ధులు నౌచు గృహస్థధర్మముల్
నెఱపిరి నాఁడు నేఁడొరులు నేర్చుకొనందగు నేటిపద్ధతిన్.

తీయని కాలమెల్లఁ గడతేరెఁ గ్రమంబుగ, నింక నెన్నఁడో
ఆయువు చెల్లిపోవు సమయంబును డగ్గఱె; నెంతయున్ గనుల్
కాయలు గాచిపోయినవి గాని సుఖోదయభాగ్య మబ్బలే
దా యతిలోకభాగ్యులకు- నక్కట! యేమి పురాపరాధమో!

వన్నె బంగారుపూతల ప్రత్నరుచిర
రత్నకల్పితభూషణార్భటుల వెలయు
రమ్యహర్మ్యమ్మునను బాలరత్న మొండు
లేమి సర్వమునుండియు లేనిదయ్యె.

శ్రావణము.

కోటిసామ్రాజ్యసంపదల్ కుదువఁ బెట్టి
యైనఁ గొనరాని దొక బిచ్చగానికైనఁ
బడయఁదగినది భాగ్యరూపంబు నైన
దిలను కలవయ్యె నాదంపతులకుఁ గాన్పు.

పొలము లిండ్లును రత్నరాశులును వివిధ
ధనకనకవస్తువస్త్రవాహానముఖంబు
లైన సర్వార్థములును వ్రశ్నార్థకముగఁ
దోచె సుతహీనులౌ దంపతులకు నెదుట.

విదితమహార్థముల్ సుజనవిశ్రుతవృత్తులు సద్భుతంబులౌ
పదము లలంకృతుల్ విమలభావములున్ మృదుశయ్య లెంతయున్
పొదలును గాక దివ్యరసపూర్ణముగాని కవిత్వమట్లు త
త్సదనము పుత్రహీనత సతంబును గన్పడు రిక్తశోభమై.

కొడుకు తనముందు చేయు దుందుడుకుపనులఁ
గాంచు భాగ్యమ్మునకు కలల్ గను నతండు
బుడుతఁ దన చంకనిడి పాల బువ్వఁ బెట్టి
యూరడింపఁగ నువ్విళు లూరు నామె.

పొరుగింటి పాప నిద్దురవోక తల్లిని
నిదురింపనీక దండించునపుడు
తమయింటి దాసి గర్భముఁ దాల్చి ప్రసవించి
కొడుకుచెక్కిలి ముద్దుఁ గొనిన యపుడు

దాసరిబిడ్డ తత్పరత బిచ్చపుఁబాటఁ
దన తల్లికడ నేర్చుకొనిన యపుడు
బడిపిల్ల లుత్సాహభరితులై గంతులు
వేయుచు నిండ్లకు వెడలునపుడు

సంతతిప్రేమ యెడఁదల గంతులిడఁగ
చూచి తలలూచి పరికించి శూన్యగృహము
వృద్ధదంపతు లాత్మజీవితము లిట్లు
మొరడువోవుటఁ దలఁచి వాపోవుచుండ్రు.

స్వాంతము తదేకమాత్రకాంక్షాప్రశక్తి
నటమటింపఁగ వార లహర్నిశంబు
సలుపు కఠినోపవాసదీక్షావ్రతాది
కములు ఫలియింప నొక శుభకాలమందు.

ఆమె కేబది, యతనికినరువది, యగు
నేట నోములపంటయై కోటిసూర్య
భాసమానశరీరుఁడై ప్రభవమందె
మోహనాకారుఁడగు నొక ముద్దుకొడుకు.

అతఁడు పితృఋణంబు నవలీలగాఁ దీర్చు
కొన నొక బంగారుకొండ దొరకె
అతనిఁ బున్నామదుర్గతినుండి గడియలో
దాటించు నొక కర్ణధారి దొరకె

శ్రావణము.

అతని వార్ధక మెల్ల నానందమయముగా
సవరించు నొక చికిత్సకుఁడు దొరకె
అతనిసంపదచేత నర్థిసత్కారంబుఁ
గావించు నొకయధికారి దొరకె

అతఁడు ధన్యులలో నెల్ల నగ్రగణ్య
పదవి నార్జించె, నిన్నాళ్లు బ్రతుకునందు
ననుభవింపని యొకతృప్తి ననుభవించె
ఇంక నతనికి వలసిన దేమి కలదు ?.

ఎన్ని దినములనుండియో యితరచింత
విడిచి సుతజన్మకై పలవించుచున్న
ముసలికన్నులు నేటికి పుత్రునిఁ గని
ఎంత వికసించెనో చెప్ప నెవరితరము ?.

అతఁడు సుతునకు జాతకర్మాదివిధులఁ
దీర్చి కులవృద్ధగురుజనాదేశమంది
బ్రాహ్మణావళి వేదమంత్రములు చదువ
శ్రావణుం డని నామంబు సంతరించె.

సూను నతృప్తనేత్రములఁ జూచుటలో మఱి పెంచుకొంటలో
ఏ నిమిషార్ధమేని నొకయించుక తీరిక లేకయుండియున్
మానరు వైశ్యదంపతులు మాధవదివ్యపదాంబుజద్వయీ
ధ్యానము సంతతాతిథిసమర్చనమున్ నిరతాన్నదానమున్.

ఊయెలత్రాడుల నూఁతఁగాఁ గొని వంగి
కొమరుని శిరము మూర్కొనెడువాని
ఆకలివేళ 'క్యా' రని యేడ్చు పసివాని
నాడింపఁ ద్రొక్కుళ్లు లాడువాని
కడుపార పాల్ద్రావి కడుఁ గేకిసాలాడు
బుడుతని చిబుకంబు పుడుకువాని
పసిపాపనిద్దురపాటు నెగాదిగ
ననిమేషదృష్టుల నరయువాని

ఇనుమడించిన వాత్సల్యమునఁ గుమారు
గడియగడియకు నెత్తుకోఁ గడఁగువాని
విశ్వనాథునిఁ గని ప్రేమవివశ యగుచు
నతనిసతి యన్నపూర్ణ "ధన్యాఽస్మి" యనును.

పృథివి వక్షము నాని పెదవులు బిగియించి
బారలు సాచుచుఁ బ్రాఁకునాఁడు
విద్దెమ్ముల న్నేర్చి ముద్దున వ్రాలఘుంగ
తడబడు నడుగుల నడచునాఁడు
"అత్త! తాతా!" యను నస్ఫుటాక్షరముల
బంగారునోటితోఁ బలుకునాఁడు
చెలికాండ్రతోఁ గూడి పలక బొఁత్తమ్ముల
చేఁబట్టి బడికి వేంచేయునాఁడు

శ్రావణము.

ఆటలో దూళి మేనిపై నలమ జుట్టు
రేపుకొని ముందు సాక్షాత్కరించునాఁడు
తల్లిదండ్రులకనుల సుధాస్రవంతి
చక్కఁ బ్రవహింపఁ జేసె నా శ్రావణుండు.

పిదప నుపనీతుఁడై గురుపదముఁ బట్టి
చదివెఁ గ్రమమున సర్వశాస్త్రముల నతఁడు
నాఁటి పండితసభ యొకే మాటగాగ
నుతి యొనర్చెను బాలపండితుని ప్రతిభ.

నిరవద్యమ్ముగ బ్రహ్మచర్యవిధులన్ సేవించు, శుత్యర్థత
త్పరతన్ విజ్ఞుల నాశ్రయించు, పితృసేవాదీక్ష సాగించు సు
స్థిరచిత్తమ్మున నన్నదానమున మాతృశ్రీకి సాహాయ్యమున్
నెఱపున్ వైశ్యవటుండు సర్వసుగుణానీకప్రియంభావుష్ణుఁడై.

ఆమ్నాయసంప్రదాయం బొక సుజ్యోతి
వెలిఁగించె నతని హృద్వీథియందు
అతులితబ్రహ్మచర్యం బొక విస్ఫూర్తి
నమరించె నతని యంగముల యందు
పితృచరణార్చనావిధి యొక పవిత్రత
వెలయించె నతని జీవితము నందు
సర్వవిద్యావిశేషం బొక జీవంబుఁ
గల్పించె నతని వాక్యముల యందు

"బుగ్గ లాజని యింతటి ప్రాప్తప్రాయ
మేమి ? యనితరసులభము లిట్టిశక్తు
లే" మనుచు నక్కజంపడి రెల్లవారు
అరయ నతఁ డొక యవతారపురుషుఁడేమొ.

పదసౌ పాండితితో విశుద్ధరుచితో బ్రహ్మణ్యుఁడై యున్న యా
పదునాఱేఁడుల బ్రహ్మచారికి నమోవాకమ్ము లర్పించు కో
విదులం జూచుచు విశ్వనాథుఁడు సదావిఖ్యాతమోదాశ్రువుల్
ముదిగడ్డమ్మును మీసలం దడుప లో లో పొంగిపోవున్ గడున్.

"పన్నాళించుట కన్న సాపడుట కన్న
ధర్మనిర్వహణమె దేహధారి కెందు
ముఖ్య" మనుమాట కొక లక్ష్యముగ వసించె
పావనగుణాశ్రయుండగు శ్రావణుండు.

"పరుగువాఱెడి కాలప్రవాహమందు
లిప్తయు మహార్ఘ" మని యాకళించుకొనియె.
ఆర్షవచనంబులందుఁ బ్రత్యక్షరమునఁ
గలుగు శక్తిని ప్రయతించి తెలిసికొనియె.

పనికిమాలిన జీవితపథమునందు
దేని సాధింపవలయునో, దేనివలన
మానవత్వము చరితార్థ మౌనొ, దాని
నెపుడు సాధించుకొన నుత్సహించునతఁడు.

# శ్రావణము.

శ్రుతిసారమ్మును సర్వధర్మశిఖరాగ్రార్థంబు పూతంబునౌ
"పితృదేవో భవ" యన్న భాషితము నే వేళన్ మనస్సంపుట
స్థితముం జేసెనొ యావటుండు, తనువుం జిత్తంబుఁ దన్మంత్రవా
సితముం జేసియె జీవితంబు నడిపించెన్ విజ్ఞులోహో యనన్.

"తల్లిదండ్రులు గాక కొండొక దైవతంబు
నరున కేవ" రని యాతని నమ్మకంబు
"పితృపదార్చనకన్న నీ క్షితిని తృప్తి
యన్యమే" మని యాతని యనుభవంబు.

అతఁడు ప్రశ్నించు- "నీకను లందుఁ దిరుగు
పావనుల పూజ చేసికో లేవు గాని
కానబడనట్టి దేవతాగణముకొఱకు
నటమటించుట పిచ్చిగాదా!" యటంచు.

పావననిజమాతృదేవీపదమ్ముల
రాణించు పసుపుపారాణిపూఁత
పసదూలు ముదుసలిబాబు మైనలయిక
వాయించు చందనపంకచర్చ
"అన్నమో రామచంద్రా!" యను దౌర్భాగ్య
తతికి సౌభాగ్య సంతానశాఖ
సంతతశ్రీహరిచరణపంకేరుహ
పూజ కాయత్తమౌ పూలఁదోఁట

శంఖచక్రాది దివ్యలాంఛనము లెన్నొ
చక్కఁగాఁ జూపు నొక ప్రదర్శనగృహంబు
కోమలత్వంబునకు లక్ష్యభూమి యగుచు
నలరు నా వైశ్యసుతుని హస్తాంబుజంబు.

సుతుఁ డీనాటికిఁ బెద్దయై గుణగరిష్ఠుండై బుధోత్తంసుఁడై పితృభక్తుండయి మానవాసులభమౌ విఖ్యాతి నార్జింపఁగాఁ బితరుల్ పారములేని మోదమునఁ దృప్తింజెంది, రంతే ననాహతసౌఖ్యమ్మునఁ బొల్చె వారిభవనం బానందసామ్రాజ్యమై.

శ్రావణము.

# మధ్యమఖండము.

## రెండవసర్గము.

ఆ దేశమ్మునఁ గొన్నినాళ్ళకు నృపాత్యంతాపచారంబొ మ
ర్యాదోపద్రుతధర్మలోపమొ, యచింత్యం బైన యే హేతువో
ప్రాదుర్భావమునందె భీజనకమై ప్రాణిప్రపీడాకరం
బై దుర్భిక్ష మొకండు దారుణముగా నాకస్మికంబౌ గతిన్.

ఇనుఁ డాత్మీయ మహోగ్రదీధితులచేనేచెన్ బ్రచండమ్ముగా
ఘనుఁ డత్యంతము లోభమూర్తియయి చిక్కంబట్టుటల్ నేరిఁ
తనసారంబు నశింపఁగా ఫలవిహీనం బయ్యె భూమీతలం
బనయం బచ్చటఁ దాండవించె నొక శూన్యత్వంబు నిర్విఘ్నమై

త్రావన్ గ్రుక్కెఁడు మంచినీరు, కడుపారందిండియున్, హాయి
సేవింపం దగు చల్లగాలియు నశించె న్నాటికి న్నాటికిన్,
సౌవర్ణప్రతిమానకాలమున కాశ్వాసాంత మై పోఁగా
నావిష్కారము నందె నాయసయుగం బా దేశమం దెల్లెడన్.

తాతల్ పెట్టిన భిక్షగా పరిగృహీతంబైన సద్వృత్తితో నే
తావత్సమయంబు కష్టపడుచున్ స్వేచ్ఛావిధిన్ జేయు సు
స్థితంబౌ వ్యవసాయజీవికకు స్వస్తిం జెప్పి నిర్భాగ్యులౌ
రైతుల్ దిక్కులఁ జూడ సాగి రొక కర్తవ్యంబు గన్పింపమిన్.

కలవా రెందఱో గుండెనిబ్బరముతోఁ "గానిమ్ము మావంటి వా
రల కే" మంచు చరించు కాలము గతార్థం బయ్యె, నవ్వారి పె
ట్టెలలో మూలఁగెడి స్వర్ణఖండతతి యట్లే యుండఁగా నింత యం
బలి కైనన్ గతిలేని రోజులును సంప్రాప్తించెఁ జిత్రంబుగా.

ఏయెడఁ జూచినన్ "దినుట కేమయినన్ దయసేయు మింత య
మ్మా!" యను కేకలున్, "కడుపు మాడుచు నున్నది సైపఁజాలఁ ద
ల్లీ!" యను నార్పులున్ బ్రదుక లే నను యేడ్పు లరణ్యరోదన
ప్రాయము లౌట నిత్య మలవా టయిపోయెను దేశ మెల్లెడన్.

తమ దేహమ్మున రక్తపుం జెమట జిందన్ జాలఁ గష్టించి యా
శ్రమకుం జాలని కూలి నందుకొని తత్సంప్రాప్తమా కేవలా
న్నముతో బిడ్డల కెంగిలించుచు నమో నారాయణా! యంచు వా
రములున్ బక్షము లాఁకటం బడిరి నిర్భాగ్యుల్ నిరాహారులై.

"ఆఁకటిచిచ్చు ఘోరతరమై దహియింపఁగ నేడ్చు బిడ్డ క
మ్మా! కబళం" బటంచు ధనికావసథంబుల చెంత నిత్యమున్
డేకియుఁ బట్టెఁ డన్నము గడింపఁగఁ జాలమి నైజదేహమున్
గాకులు గ్రద్దలున్ సుఖముగా భుజియింపఁ ద్యజించి రెందఱో.

నాటివఱ కొక్కవిధముగా నడచుచున్న
ధర్మవర్తన మేసముద్రంబు నందు
మునిఁగిపోయెనో— ఆ దేశజనులలోన
రాజ్య మేలెను స్వార్థపరత్వ మొకటె.

# శ్రావణము.

దేశం బెల్లెడ నిట్టి దుర్దశలు వృద్ధిం జెంద నేనాటికిన్
లేశంబున్ బ్రతిరోధమార్గ మొకడేనిన్ గానఁగా రాక ప్రా
ణాశల్ వీడిన లోకులం గని వదాన్యశ్రేష్ఠుఁ డుద్యద్ఘృణ
ప్రాశస్త్యుండగు విశ్వనాథుఁడు మహోవాత్సల్య మేపారఁగా.

అన్నపూర్ణాత్వ మందిన యన్నపూర్ణ
సంతతోత్సాహవశుఁ డగు శ్రావణుండు
తనకుఁ దోడయి యెల్ల కృత్యములు నడుప
పూని యొనరించె నిరతాన్నదానదీక్ష.

మునుపే వారల యిల్లు పేర్వడియె రేపున్ మాపు నన్నార్థులన్
దనుపన్ దద్విషయజ్ఞులై నిరతమున్ తండోపతండమ్ములై
జను లచ్చోటికి వచ్చి వా రొసఁగు పూజల్ బొంది మృష్టాన్నమున్
దిని దుర్భిక్షభయంబులన్ విడిచి తృప్తిం జెంది రత్యంతమున్.

అతఁడేమో తృణమన్యమానవిభవుండై యన్యదేశస్థితా
యతధాన్యాదుల సేకరించెఁ దనద్రవ్యం బెల్ల వెచ్చించి ప్ర
స్తుతదుర్భిక్షవిపత్తుఁ దీర్ప నుచితజ్ఞుండై — యపూర్వంబు న
ద్భుతమౌ త్యాగముఁ జూచి నాటి ధనవంతుల్ విస్మయం బందఁగన్.

సలిపెన్ సార్వజనీనమున్ నిరతపూజాపూత మత్యాదరా
కలితంబున్ పరితర్పితాఖిలజనవ్రాతం బిహాముత్రస
త్ఫలదం బైన మహాన్నదానమును విశ్వస్తుత్యమౌరీతి ను
జ్జ్వలభావుండగు విశ్వనాథుఁడు ఫలాశాశూన్యభావమ్మునన్.

జనకుం డిట్లు నిరంతరాద్భుతమహోత్సాహమ్మునన్ గ్రామసం
జనితాపద్వినివారణోచితవిధుల్ సాగించుటం జూచి యీ
జనసేవావసరమ్మునన్ దన తనూసాఫల్య మార్జింపఁగా
ఘనవిద్యాప్రవణుండు శ్రావణుఁడు సంకల్పించె నత్యాదృతిన్.

తన తండ్రి కడు సమాదరమున నతిథిసం
తతులకుఁ బూజ లొనర్చునపుడు,
తన మాతృదేవి యుత్సాహంబునన్ వంట
యింటికృత్యము నిర్వహించు నపుడు,
తన సేవకావళి పనిఁ బూని యాహార
వస్తువు లాయత్తపఱచు నపుడు,
తనయింట నతిథిభోజనవేళఁ బరివేష
కులు సంభ్రమమ్మునఁ జెలఁగు నపుడు,

అన్నిచోటులఁ దానయై యన్నిరూప
ముల ధరించుచు లోపముల్ గలుగ నీక
అందఱకుఁ దోడునీడయై యహరహంబు,
తానె తలఁ బెట్టుకొనియె బాధ్యతలనెల్ల.

ఈ పసిప్రాయమందె శతవృద్ధులనే నధరీకరించు వా
ఙ్నైపుణి కార్యచాతురి వినమ్రతయున్ గడియించి సర్వలో
కోపకృతిప్రవీణుఁడయి యొప్పిన యాతఁడు సర్వదాక్రియా
వ్యాపృతిచేత నా యతిథివర్గములం దనియించె నెంతయున్.

శ్రావణము .

తఱుఁగని ధనసంపదల బ్రోవుబెట్టఁగా
నర్హుఁడౌ నొక యుత్తరాధికారి,
వెలిపట్టుపరుపుటూయెలలందు సుఖమును
బడయఁజాలిన యొకభాగ్యశాలి.
తమి మీఱి సర్వశాస్త్రములను తఱచుగాఁ
దరచెడి యొకకళాదర్శమూర్తి,
కదలినఁ గంది రక్తముఁ జిందు నెమ్మోని
పరువంబుగలయొక తరుణమూర్తి,

విడిచి ధనతృష్ణ, సౌఖ్యంపు విధుల విడిచి,
చదువు లోకమూలగాఁ బెట్టి, సౌకుమార్య
మావలకుఁ ద్రోసి, మానవసేవకొఱకుఁ
గడఁగి యర్పించె వాఙ్మనఃకాయములను.

అతని చే సోకిన యన్నంబు జీవనౌ
షధమేమొ బ్రదికించె సర్వజనుల,
అతని వాగ్వైఖరి యమృతప్రవాహమో
ఆఁకలిదప్పుల నడఁపఁ జాలె,
అతని నిర్మలమందహాసంబు చంద్రికా
సారమో యెడఁదలఁ జల్లఁబఱచె,
అతనియాదరణపద్ధతి వశీకరణాస
న్మంత్రమో, కాలిబందాలు వైచె,

అతనినిరతాన్నదానసద్వ్రతవిధాన
మురుతరాత్మీయదేశభాగ్యోదయంబొ
తొలఁగఁ ద్రోసెను దుర్భిక్షదుఃఖమెల్ల
ననుచు వినుతింతు రాతని నతిఘు లెప్పుడు.

తొలఁగించె నిజదేశదుర్భరదారిద్ర్య
రాక్షసీనృత్యసంరంభ మతఁడు
మొలిపించె మరణసమ్ముఖలోకమానస
మ్ముల జీవితాంకురముల నతండు
మలయించె నిజతపఃకలితవిజ్ఞానాను
భవరూపఘనసౌరభముల నతఁడు
వెలయించె సర్వదిగ్వీథీస్థలమ్ముల
నిజయశఃపూర్ణచంద్రికల నతఁడు

అరసి గడియించుకొనె నాతఁ డనుపగమ్య
మానవత్వచిరంతనానూనభాగ్య
వత్త్వవిద్వత్త్వసదృశసత్ఫలితములను
ధన్యుఁ డాతఁడు ధన్యమూర్ధన్యుఁ డతఁడు.

నిలువ నీడయు లేనివారి కిరవొందెన్ మిద్దెలున్ మేడలున్
కలికిన్ గంజికి మోమువాచిన యభాగ్యశ్రేణికిన్ స్వేచ్ఛమై
కలమాన్నంబు లభించెఁ బుష్కలముగా— క్షామంబు దేశంపుఁజా
యల నత్యంతముఁ బాసిపోయెనొ తదీయాదార్యసంపత్తిచే?

పదిరెండేడుల కాల మీవిధిని లోపంబింతయున్ లేక త
త్సదనంబందు మహాన్నదానశుభదీక్షల్ సాగె, సర్వప్రజా
హృదయాహ్లాదకరంబుగా నభినవాహీనాజ్యదధ్యాదిసం
పద లొప్పారఁగ నద్వితీయగతి శశ్వద్భక్తిభావమ్మునన్.

ఆమహాయజ్ఞమునకు నన్నాతురులయి
తమకుటుంబమ్ములను గూడి తరలి వచ్చి
స్థిరముగాఁ దద్గృహమ్మునఁ దిష్ఠవేయు
వారలేకాని కదలినవారు లేరు.

వచ్చియున్నట్టివారికి స్వాగతములు
రానివారి కనుక్షణాహ్వానములును
బెట్టి యతిథులసంఖ్యను వృద్ధిఁజేయు
వారలేకాని పొమ్మన్నవార లెవరు ?

ఈమహావేశసమయమం దెదుట నతిథి
పటలముం జూచి మురిసిపోవుటయె కాని
తండ్రిగాని కొడుకుగాని తల్లిగాని
"అస్తి నాఽస్తి" విచక్షణ నరయ రింట.

సంతత మర్థిసంతతికిఁ 'జా' లనుపింపఁదలంచు దీక్షమై
కొంత, క్షుధార్తహా నతిథికోటికి "పప్పును బాయసమ్ము"గాఁ
గొంతయుఁ, ధారవోయఁ బనిఁగొన్న వదాన్యవరేణ్యు నింటిలో
నెంతటిభాగ్యము న్నిలుచునే నశియింపక శాశ్వతంబుగా?

కలుషిత మైనదేశమునఁ గర్మఫలానుభవైకరూపమై
యలఁగొను దైవనిర్ణయము మాన్పఁగ మానవమాత్రుఁ డర్హుఁడా?
తల కొక గ్రుక్కెఁడై బహువిధమ్ముల దేశములోనివారు త
ద్విలసితవైభవమ్ములను బిలిచి పిప్పి యొనర్చి రాతనిన్.

విడిచె న్వారల భాగ్యలక్ష్మి కరుణావేశంబు చల్లారఁగా
విడువన్ లే దప్పుడైన నర్థు లతిథుల్ విస్రబ్ధసంతృప్తులై
నడచెన్ వారలమంచిరోజు లసుఖాంతంబైనరూపంబుతో
నడువన్ లేదు తదాత్మఁబాసి యప్పుడైనన్ ద్యాగసౌగంధ్యముల్.

ధనమేమో మొదలంటఁ జెల్లెఁ బయిగాఁ దాకట్టులున్ సాగె, వ
చ్చినమూల్యమ్మున కమ్మివేయఁబడె సుక్షేత్రంబు లారామముల్
ఘనసంపత్పరిపూర్ణ మైన గృహ మెల్లన్ నేఁడు దారిద్ర్యభా
జనమై చెన్నుఁ దొఱంగె— నత్కులభవిష్యం బేమి కానున్నదో?

పైగా నప్పటిచింతచేఁ గుమిలిపోవంబోలు మస్తిష్కముల్,
క్రాఁగంబోలు జరాపరిప్లుతశరీరంబుల్ కఠోరంబుగా
త్యాగైకాశ్రయు లైన వృద్ధులకు నంధత్వమ్ము చేకూఱె— నే
ప్రాగాసాదితదుష్కృతంబో పరిపక్వం బయ్యె నీరీతిగా.

"ధనము నిల్వకు ననుభవమ్మునకుఁ గూడ
తగదు; దానమె ముఖ్యకర్తవ్య" మనుచు
ధనికులకుఁ గన్నుఁ దెఱపించు ఘనుల కిపుడు
ధనముతో పాటు కఱవయ్యెఁ గనులు గూడ.

## శ్రావణము

కన్నుల్ వోయినబెంగ, అర్థిజనకాంక్షాపూర్తి కెల్లప్పుడున్
సన్నద్ధం బగు దివ్యవైభవము నష్టంబయ్యె న న్బెంగయున్.
వన్నెల్ మీఱిన జీవితమ్ముల దహింపన్ వారు కర్తవ్యతా
భిన్నస్వాంతు లపాస్తధైర్యు లగుచున్ భీతిల్లి రత్యంతమున్.

కన్నుల్ వోయిన తల్లిదండ్రు లొకవంకన్ ఘోరఘోరక్షుధా
పన్నవ్రాతము లొక్కవంక నిజనిర్భాగ్యత్వ మింకొక్కవం
క న్నిత్యంబుఁ గలంపఁగాఁ దగుప్రతీకారంబు గన్పింప క
న్నన్నా శ్రావణుఁ డెన్నికష్టముల పాలై పోయె మున్నాళ్ళలో!

రాఁదగు కష్టముల్ శరపరంపరలై తలపైన వ్రాలె, భా
గ్యోదయచిహ్న మభ్రకుసుమోపమ మయ్యెను గౌరవంబు మ
ర్యాదయు నిల్పుకోఁ దగు నుపాయము గన్పడ, దిట్టి ఘోరదు
ర్వేదనలందు మున్గి విలపించిరి శ్రావణవృద్ధదంపతుల్.

అంధు లగు వృద్ధపితరుల కనుదినంబు
స్నానభోజనశయనాసనములయందు
తాన యై శ్రావణుఁడు భక్తిఁ బూని వేయి
కనులతో వారిఁ గాపాడుకొనియె నపుడు.

ఈ పితృసేవమూలమున నేమి, పురాకృతకారణమ్మునన్
దాపురమైన భాగ్యపరిణామవశమ్మున నేమి, యాచకాఁ
ర్యాపరిపాటి సన్నగిలు జాడలు దోఁచెఁ గ్రమక్రమమ్ముగా
పాపము! శ్రావణుం డొకఁ డభాగ్యుకుఁ డెంతని చేయఁ జాలెడిన్?

ఒక్కరాతిరి యతిథులు పెక్కుమంది
తృప్తి దీఱ భుజించి నిద్రించునప్డు
ప్రక్షాళించినపితరులపాదములను
బట్టుచుండెను భక్తితత్పరుఁడు సుతుఁడు.

సమయజ్ఞుం డగువిశ్వనాథుఁడును వత్సా! యంచుఁ గేల్సాచి పెం
దమిమైఁ గౌఁగిటఁ గ్రుచ్చి నందనుని, నానందాశ్రువుల్ చింద మూ
ర్ధము నాఘ్రాణ మొనర్చి మై నిమిరి వాత్సల్యమ్మునన్ దుఃఖభా
రమునం గద్గదకంఠుఁడై పలికె భార్యారత్న మాలింపఁగన్.

నాన్నా! యెంతటిమోస మయ్యె నవమానం బేమి రా నున్నదో
ఎన్నో చిన్నెలు చూపుచుం దరలిపోయెన్ లక్ష్మి యున్మత్తుగా
నున్నట్లుండి — యిదేమికర్మఫల మౌనో గాని — వెన్వెంట మా
కన్నుల్ సైతము దొంగిలించినది మార్గం బేమిరా యీపయిన్?

వనితారత్నముతో ననన్యబహుళైశ్వర్యంబుతో నేటిదాఁ
కను నిర్విఘ్నముగా భజించితిని సౌఖ్యశ్రీల, నూఁజంకెదాఁ
పువకుం జేరెను నావయస్సు — కనులుం బోయెన్, జరారూపనై
ధనశయ్యాస్థలి నున్న నాకు ధనముం దారిద్ర్యముం దుల్యముల్.

కానీ మున్నవపత్యతావ్యథలఁ గాఁకల్ రేఁగు మాజాంత
ప్రాణమ్ముల్ హిమబిందువర్షమున నోలాడన్ కులప్రాభవా
నూనాధారముగా జనించిన గుణాఢ్యు న్నిన్ను నేకైకసం
తానంబుం బడఁద్రోసితిన్ బలిమిమై దారిద్ర్యకష్టాంబుధిన్.

## శ్రావణము

పరిణయ మన్నమాట చెవిఁ బట్టఁగనీయక యింతకాలమున్
జరిపితి వెందఱెంద అయినందమపుత్రిక నీ కొసంగగా
తిరిగిరి మున్ను, నేఁ డవమతిం బడఁద్రోసెను దైవ మిట్లు, నీ
పరిణయ మెట్టు లింక, హతభాగ్యుల మింతకు మేము పుత్రకా.

ఇన్నిటికేమిగాని మనయింటఁ జిరంతనపానభోజనా
భ్యున్నతమోదమేదురత నున్నవనీపకకోటి పొట్టకున్
తె న్నొకయింత లేక యతిదీనత దిక్కులువట్టి యెంతయా
పన్నము భీతభీతము నపాస్తశరణ్యము నౌచుఁ గుందునో?

దుర్భిక్షోగ్రపిశాచి దేశమునఁ జిందుల్ద్రొక్కెనాఁ డెందఱో
నిర్భాగ్యుల్• మన కున్నయంతవఱకే నీరంబులో ద్రావుచున్
నిర్భీతిన్ మనినారు — నేఁటికిచట న్నిప్పచ్చరంబై కటా!
నిర్భేదించెడి సౌహృదంతరముఁ దండ్రీ! అంపఘుంగోఁతగా.

ఏది యెటున్న నింతవఱకీశతవృద్ధునిజీవితంబులో
లే దనుమాట లే దసుఖలేశము లేదొకమాఱె యాంధ్యమున్
పేదఱికంబుఁ గూడ నొదవెన్ దురవస్థలు దాపురించె నో
రా! దురదృష్టవంచితుల మైతిమి మేమును నీవు నేఁ డిటుల్.

అన్నపూర్ణాసమాన యీయన్నపూర్ణ
కరమునను గంజితడియైన దొరకనంత
చిక్కనంబడె, నేఁటికాజీవితంబు;
చావు మోయన్నపూర్ణ! నిస్సంశయముగ.

ఓయతిథులార, మాయింట నున్న దెల్లఁ
జెల్లిపోయెను, మీసేవఁ జేయుభాగ్య
మంతరించెను, దురవస్థ లతిశయించెఁ
దడవికొనుఁడయ్య యెవ్వారిదారి వారు.

"స్వకృతకర్మోపహతుఁడు జీవచ్ఛవంబు
విశ్వనాథుఁడు మా కింత పెట్టలేక
పాఱఁద్రోలె" నటంచు రేసకడనుండి
చెప్పుకొనరయ్య సర్వదిక్కులందు.

ప్రాణపణ మైనయర్థిసేవావ్రతంబు
చేయఁగాలేక మిమ్ము వంచించి మిగుల
మొరఁడువాఱిన యీక్షుద్రకరయుగళము
తెగనఱకుఁడయ్య పున్నెము నెగడు మీకు.

అని యుద్రిక్తగభీరవాక్యరచనాప్రారంభసంరంభుఁడౌ
తనతండ్రిం గని తత్ప్రభాషణవిఘాతం బాచు వైకల్య మం
దినచిత్తమ్మును జిక్కఁబట్టుచు మహాధీరత్వసౌభాగ్య మా
ననపద్మమ్మున మాటిమాటి కిరవొందన్ శ్రావణుం డిట్లనెన్.

ఇచ్చినచేయి మీది — మనయింటి కనారత మొందఁజెందఁగున్
వచ్చి యపూర్ణకాంక్షఁ జనుపద్ధతి లే, దలవాటు దప్పె నేఁ
డిచ్చుటఁ బ్రోవు లా నతిథులెల్ల మనంబునఁ దోప నింతగా
వెచ్చనిమాట లాడితిరి వీరికి నన్నము పెట్టఁజాలమిన్.

## శ్రావణము

తాము వృథా వ్యథాభరము దాల్చి శ్రమించిన లాభ మేమి? తం
త్రీ! మితిమీఱి లోకము ననేకవిధమ్ముల నేఁచుచున్నయీ
క్షామము బాపఁగా శపథకంకణముల్ మన మింతుఁ బూనియు
న్నామొకొ దేశకర్మపరిణామము మాన్పఁగ నేరిశక్యమా?

కాలము సాగుచున్నయది గాని రవంతయు శాంతిచిహ్నముల్
గ్రాలుట లేదు, దేశము నిరంతరఘోరదవానలంబులోఁ
గాలుచు నుండెఁ జేయఁగలకార్యము చేసితి రింకఁ జేయఁగాఁ
జాలనియప్పు డేఁటికి విచారము, లేఁటికిఁ బౌరుషమ్ములున్?

కలధనమెల్ల నర్థిపరికల్పిత మయ్యెను ధన్య మయ్యె మీ
కులము తరించె, దైవ మనుకూలము గామి భవద్విలోచన
మ్ములు నతిదుస్తరాంధ్యపరిభూతము లై చెడె — నింతకున్ మహో
జ్జ్వల మగు జ్ఞాననేత్ర మెడఁదన్ వికసింపఁగ మీకు లోపమా?

ఉంటిని మీకు నిర్వురకు నుమ్మడికన్నుగ నేను — నన్ను మీ
బంటు ననుగ్రహించి నిరపాయత వార్ధకజీవితంబులన్
గెంటుఁడు, చింత మానుచు సుఖింపుఁడు రక్తము దారవోసి మీ
కంటకితాధ్వముల్ కుసుమకల్పితతల్పములట్లు చేసెదన్.

కలదు భుజాగ్రపీఠి మిముఁ గావడి మోసెదఁ — బూవు లమ్మి క
ట్టెల నెటు లమ్మవచ్చును? తృటిన్ విడనాడుద మీపురంబు న
వ్వల నిట నున్నవారిగొడవల్ మన కేఁటికి? సంతసంబు చి
ప్పిల నొకజోలి గట్టి మిముఁ బెంచెద నేపరరాష్ట్రసీమనో.

కుదిరినయీయుపాయమునకున్ సమయజ్ఞత నన్నపూర్ణ దో
హద మొనరించె. వే ఱొకయుపాయము లేమిఁ దలంచి సారవ
స్మృతిమధురప్రసంగదృఢనిశ్చయుఁ డా సుతుఁ గౌఁగిలించుచున్
హృదయము పొంగువాఁడు 'సరియే' యనె వృద్ధకుటుంబి మెచ్చికన్.

శ్రావణము.

# మధ్యమఖండము.

## మూడవ సర్గము.

తనకళాసంపత్తి తఱుఁగ జైవాతృక
స్వామి మెల్లగ నధఃపతితుఁ డయ్యె
తమబాంధవునివియోగము దుర్భరం బౌటఁ
గలువలఁ దుహినాశ్రుకణము లురలె
తమనోటి కింత యాదరువు తప్పినచింత
చలిపిట్టలకు మనశ్శల్య మయ్యె
తమకాంతిరేఖాలవము "మినుకు-మినుకు"న
నుడుగణమ్ములు బయల్పడియె వేగ

మూతిముడుచుట మాని సంప్రీతిఁ గొనఁగ
పంకజన్మాళి కదియొక వంక దొరకె
ఎవ్వ రేడ్చిన నెవ్వరు నవ్వుకొనిన
నతనిపయనమ్ము రవ్వంత యాఁగలేదు.

అలమెం జీఁకటి దిక్కులందు శివకంఠాంతర్విలుంఠద్ధలా
హలపూరంబు బహిర్వినిర్గతమయి బ్రహ్మాండంబు పూరించెనో!
కలితౌదార్య మహాత్ము నొక్కనిని నిష్కాసించు నాపాపపం
కిల దేశమ్మున నెవ్వఁడే నొకమహాకృష్ణధ్వజం బెత్తెనో!

అదె సుముహూర్తమయ్యె సకలాశ్రితబంధువు లైనయన్నాణి
కన్నదనమువారికిం గృహవిసర్జనముం బొనరింప నక్కటా
కదలినవేళలన్ గనకఘంటలు మ్రోయ సుఖించువారి న
య్యదనునఁ ద్రోసిపుచ్చెను రహస్యముగా విధి కాఱుచీఁకటిన్.

ఒరు లెవ్వారును గుర్తుపట్టనటు లేమో మాఱువేషమ్ములం
బరికల్పించిరి దుర్వ్యథానలశిఖాభస్మీభవన్మానసాం
తరు లయ్యుం జిరధైర్యమున్ విడక మానంబూని నీలాంబరాం
తరితాంగప్రభ లొప్పఁ బోవఁగ బ్రయాణంబైరి వా రంతటన్,

కావడి గట్టి యందు నొడికంబునఁ దల్లిని దండ్రి నుంచి మేల్
పూవులఁ దత్పదాబ్జములఁ బూజ యొనర్చి నిసర్గభక్తిదీ
ప్తావశుఁడై ప్రదక్షిణము సల్పి నతించి కులాధిదేవతన్
శ్రావణుఁ డొప్పమై నిజభుజమ్ముపయి న్నెలకొల్పెఁ గావడిన్.

రమణీయదివ్యచిరత్నరత్నోపల
ప్రతిబద్ధ మైన హర్మ్యముఁ దలంచి
అవిరళదానధారాఽప్రశోద్దేశమై
నాఁచు గట్టిన ప్రాంగణముఁ దలంచి,
పరదినభోజనాఽభావ మెఱుంగక
శయనించు నతిథిసంచయముఁ దలచి
"రాత్రికిరాత్రి" దుర్వారంబుగా నిల్లు
వెడలంగ నడఁచు దుర్విధిఁ దలంచి

కానడింపఁగ నడుమునుగట్టియున్న
కుసుమసుకుమారుఁడౌ పుత్రకునిఁ దలంచి
నిలుపఁగారాక వెడలెఁ గన్నీటికాల్వ
దంపతులయంధనేత్రరంధ్రముల నుండి.

ధీరత్వమ్మునఁ దల్లిదండ్రులకుఁ దృప్తిం గూర్చుచున్ శ్రావణుం
డూరిం దాఁటెఁ దదీయదీర్ఘతరబాహోద్యానముం దాఁటె నె
వ్వారున్ లేవకమున్నె గుండె లవియం బర్వెత్తి క్రోశత్రయీ
దూరం బేగఁగఁ దెల్లవాఱె, నపు డందుం దింపె నాకావడిన్.

తొలుతన్ గుంకుమపంకముల్ పొడమెఁ, దోడ్తో నస్ఫుటీభూతపిం
గళవర్ణమ్ములు రేఁగె, నావెనుక నాకాశమ్ము భేదించుచున్
మొలిచెన్ వేయిమయూఖముల్, బిదప నున్మీలించి మందేహులన్
జెలువం బొప్పఁగ బాలసూర్యుఁ డుదయించెన్ దూర్పుఁగొండపై.

పరితోషమ్మున మేలుకొల్పుపదముల్ పాడెన్ శకుంతౌఘముల్
జిరనిద్రాణము లైనకన్ను లఱవిచ్చెన్ బద్మినీకాంత త
త్స్ఫురతస్సీమల సౌఖశాయనికమై మ్రోఁగెన్ ద్విరేఫాళి, భా
స్కరుఁ డుద్యత్కరుఁడౌచు మంచుతెర నాకర్షించె లీలాగతిన్.

తల్లిదండ్రుల కుచితకృత్యములఁ దీర్చి
యపుడపుడె పూర్వభూధర మధివసించి
యున్నభాస్కరు భక్తిభావోన్నతుండు
శ్రావణుండు నుతించె నంజలి ఘటించి.

ఓదివాకర! వేదత్రయోపగమ్య
సత్ప్రభావ! విభావసూ! సప్తసప్తి!
కర్మసాక్షీ! జగన్నేత్ర! ధర్మమూర్తి!
దినమణీ! లోకబాంధవ! దేవదేవ!

క్షుద్రతామిస్రపంకవిక్షుబ్ధ మగుచు
పాడువడియున్న బ్రహ్మాండభాండ మెల్ల
కరసముత్క్షిప్త మైనబంగారుసీటం
దానమాడించినావు వేదస్వరూప!

ఎన్నియుగములనుండియో యీప్రయాణ
మెన్నియుగములదాఁకనో, యేది గమ్య
మో, రవంత యెఱింగినవార లెవరు?
ప్రవిమలానందరూప! నిర్దళితపాప!

స్వామీ! తావకధామ మొక్కటియె విశ్వంబందు నంతర్బహి
స్సీమల్ నిండిన యంధకారమును నిశ్శేషమ్ముగా విం చు, నీ
ప్రామాణ్యమ్మునఁ గాలచక్ర మొకరూపం బొందు, దేవాదిదే
వా! మాన్యం బగు నీప్రసాదమునఁ గాదా సర్వవిజ్ఞానముల్?

లోకారోగ్యపరాయణుండవు దయాళూ! దేవ! యాకృష్ణమా
ఆకాశమ్ముననుండి మర్త్యుల కమర్త్యత్వంబు గల్పించుచున్
సాకల్యమ్ముగ లోకవృత్తముఁ బరీక్షాదృష్టి వీక్షించుచున్
రాకలోకలు చేయుచుందువు సువర్ణస్యందనస్థుండవై.

నీయుద్యన్నవబింబ మిందుఁ గనుఁగొంటిన్ ధన్యత్రాశీల నే
డాయం గంటిని భావిజీవికను దార్ఢ్యంబేర్పడన్ ధైర్యవి
ద్యాయోగంబు ననుగ్రహింపుము మహాత్మా! తల్లికిం దండ్రి కీ
యాయుశ్శేషము నిర్నిరోధశుభసౌఖ్యాన్వితముం జేయుమా.

వీరే నాతలిదండ్రు లర్థిజనతావిస్రబ్ధవిశ్రాణిత
స్ఫారైశ్వర్యులు దీనదీనులు జరావ్యాప్తాంగులై యంధతా
ప్రారబ్ధాంకితులై యనన్యగతి ని న్నర్థించుచున్నారు దే
వా! రక్షింపుము వీరి నింత కరుణాపాంగంబు సారించుచున్.

ఈవిధి వీరి నిర్వురి వహింపఁగ నోపిక నిమ్ము నాకు — నా
భావమునం దనూనపితృభక్తిని నిల్పుము — తుచ్ఛతుచ్ఛమో
దానహ మైనసౌఖ్యమునకై పరువెత్తఁగనీకు — మింక నా
జీవిక సాగుఁగాక పితృసేవకు నాపయి లోకసేవకున్.

అని బాలాతపరమ్యమూర్తి రవి నభ్యర్థించి యర్ఘ్యాదికం
బనుకల్పించి యుపాంతసీమ నిభృతధ్యానప్రసక్తాత్ముఁ దం
డ్రిని వీక్షించి యొకింతసే పరసి "తండ్రీ! పోదమా" యన్న నా
ఘనచింతాకులుఁ డైనవృద్ధుఁ డనె శుష్కం బైన కంఠంబుతోఁ.

"పోదము లే రవంత యలపున్ సొలపుం గణియింప కెంతగా
నీదరిలేనియాతన సహింతువు నాయన! దారుణాంధతా
వేదన నందియున్ బలము వీడక యుంటిమి మేము భూమిపైఁ
బాదము మోఁపరాదో? యిటుపై నడిపింపుము మమ్ము నర్భకా!

సీకర మూఁతగాఁ గొనుచు నేనును నీజనయిత్రి యొప్పునం
దాఁక గమించిపోవ నుచితం బగుఁ గాని శిరీషసౌకుమా
ర్యాకృతి నొప్పునీబుజమునం దొక కావడి—, యందునేము—, ల
జ్జాఽకరమైన మాట తనయా! యిది చక్కఁ దలంచి చూచినన్."

"హరిహరి! యేఁటిమాటలు దయామయ! మీరు సహస్రమాసముల్
నెరసినవృద్ధు లంధులు ననింద్యచరిత్రులు, నూత్నయౌవన
స్ఫురితుఁడు దార్ఢ్యవంతుఁ డగుపుత్రునిఁ గాంచియు దీనదీనులై
కరము శ్రమించుచు న్నడువఁగాఁ దగునే దరిలేనిత్రోవలన్.

ఈదేహంబు భవత్సపర్యలకుఁ గాదే యంకితం బయ్యె? మీ
పాదాబ్జమ్ములతోడ మిమ్మువహియింప న్నాకు నేనాఁటికిన్
ఖేదం బన్నది లేదు మీచరణభక్తి న్మించి నే నింక సం
పాదింపం గలయర్థ మున్న దె? మహాత్మా! న న్నరిక్షింతురా?

నను నిన్నాళ్ళుగ స్వర్ణడోలికలలోనం బెట్టి యత్యంత పా
వనవాత్సల్యము మీఱఁ బెంచితిరి మీ వంతయ్యె నానంతు వ
చ్చిన దీమాత్రము తల్లిదండ్రులను సంసేవించి చేయూఁత నీ
యనివాఁ డెట్టులు పుత్రకుం డగును 'నాన్నా!', మీరలే చెప్పఁడీ."

అనుచు వారలఁ గొంతసే పనునయించి
శ్రావణుఁడు భానువర్ధితోత్సాహుఁ డగుచు
అతిఘనం బున్నతము నైనయంసపీఠి
కావడిని దాల్చె జిగమిషాకలితుఁ డగుచు.

ఆదారిం బయనించునధ్వగులు శంకాన్వితులై ఘోరచిం
తాదైన్యప్రతిబద్ధతద్వదనపద్మమ్ముల్ విమర్శించి "మీ
దేదేశం" బని "యెందుఁ బోదు" రని "యిందే పొట్టలం బోసికో
రాదా మీ" రని యాదరంబు మెఱయం బ్రశ్నింతు రందందునన్.

కలఁ డీచెంతనె విశ్వనాథుఁడు త్రిలోకఖ్యాతపూతప్రథా
కలితుం డున్నతదానసంహృతమహోగ్రక్షామసంరంభుఁడై
కలకాలంబు నతండె సర్వజనులం గాపాడె, నవ్వానిచా
యలకుం బోయి సుఖమ్ముగా బ్రదుకుఁడయ్యా! మీరు మీపిల్లలున్.

అతనిసతి యన్నపూర్ణ నిత్యాన్నపూర్ణ
కరము వెలయఁగ నతిథుల గారవించు
ఆమహాసాధ్వి వర్షించునన్నమింత
మెసవువారికి లే దింక మృత్యుభయము.

తత్కుమారుఁడు సర్వవిద్యాగురుండు
ఉత్తమగుణుండు దీనజనోపకారి
శ్రావణాఖ్యుఁ డమితవిశ్రాణనమున
నతిథిపూజలఁ బితరుల నతిశయించు.

ఒకరితరువాత నొకరు నోరూర నిట్లు
పాంథు లగ్గించు తమపూర్వవైభవముల
వినుకొలఁది శ్రావణునకును వృద్ధులకును
విస్మయవిషాదవశమున వ్రీలె నెడఁద.

సంపద వాపి యర్థిజనసంగతి స్వప్నగతంబు చేసి పో
నంపితి— వింత మూఁగినక్షుధార్తుల నెల్లను మోసగించు నీ
చంపుటవస్థచే సగముచచ్చినవానిని నన్నుఁ బూర్తిగాఁ
జంపవిదేమి? నే నెవరిసౌఖ్యముకోసము భక్తవత్సలా.

ఈసమయమ్మునం దతిథు లెల్ల మదాలయసీమ భోజనా
భ్యాసము భగ్నమౌట తెలియన్ నడిమిం దమ కిట్లు గొంతుకల్
గోసినమమ్ము నేమి యనుకొందురొ? పిల్లలుబాప లెంతగా
గాసిలి యేడ్తురో కడుపు గాల్చెడియాఁకటిచిచ్చు పెంపునన్.

విశ్వనాథునిమానసవీథి నిట్టి
భావములు సందడించునప్పట్టునందు
కానడి ధరించి పర్వెత్తు క్రొనసుందు
చిత్త మధ్యాత్మవీథి వాసింపఁజేసె.

ఏనవకమ్ము లేక కృశియించిన తోఁటలుఁ జైరుబచ్చలున్
లేనిపొలంబు, లించుకయు నీరములేని జలాశయంబు, లా
త్మానుగుణమ్ముగాఁ బరసమర్పితవైభవు లైన వారి కా
హ్వాన మొసంగెఁ గాని దనుపం గలవే యొకభోజ్యసంగతిన్?

అన్నమన్నది యెఱుఁగక యున్నవారి
పద్దులోఁ బడెఁ దత్కుటుంబమ్ము గూడ
శతవిధమ్ముల క్షామపిశాచి వారిఁ
దివిరి బాధించి తనపగ తీర్చుకొనియె.

# శ్రావణము

గమనాయాసము దోఁపనీని దృఢసంకల్పమ్ముతో శ్రావణుం
డమితోత్సాహుఁడు హింస్రజంతునిబిడంబై యున్న యారణ్యమా
ర్గము దాఁటెన్ దనమాతృభూమిపొలిమేరల్ దాఁటె నొక్కింతయు
న్నము పానంబు సుఖమ్ముగా దొరకుపుణ్యాంశాత్మ వాంఛించుచున్

యాచించుం గలవారియిండ్లకడ నత్యానందసంపృక్తహా
వాచానైపుణి మీఱ, నందు సుఖలబ్ధం బైన యద్దాన సం
కోచం బింతయు లేక యర్థులను సాఁకున్, వెన్క భక్త్యాదర
ప్రాచుర్యమ్మునఁ బెట్టు వృద్ధులకు, నాపై నున్నఁ దానుం దినున్.

లక్షల్ లక్షలు గుమ్మరించి యవలీలన్ దీనసంతానమున్
రక్షింపం దొరకొన్న మాన్యుఁడు వదాన్యస్వామి నేఁడక్కటా!
భిక్షాపాత్రము చేతఁబట్టి నగరీవీథిన్ క్షుధాఽపన్నుఁడై
“భిక్షాందేహి” పదంబు పాడెను ప్రజల్ ప్రేమమ్ము వర్షింపఁగన్.

బ్రహ్మతేజఃప్రాభవస్ఫూర్తి నత్యంత
    పావనం బగు కావివలువఁ జుట్టి
మృగరాజమధ్యోపమిత మైన కటిసీమ
    ననురూపకటిసూత్ర మవధరించి
మాంసలంబగు మనోజ్ఞాంసభాగమ్మునఁ
    బైలవదండంబు గీలుకొలిపి
శంఖచక్రాదిలాంఛనలాంఛితం బైన
    యరచేత మృత్పాత్ర మనువుపఱచి.

సాత్త్వికజ్యోతి ప్రాజ్యసంభృతమగు
జ్ఞానసౌభాగ్యగరిమను జాటుచుండ
గ్రుడ్డితలిదండ్రులను బెంచుకొనంగ వటుండు
తిరిపమెత్తెను వీథులు దిరిగితిరిగి.

"ఒకవిద్యానిధి బ్రహ్మచారి యిపుడీ యూర్వచ్చె బాలార్కుడో
శుకుండో నారదుండో యనందగిన తేజోమూర్తి యాకారి! — భి
క్షుకుంజేసె విధాత యాతని" నటంచున్ సంభ్రమాశ్చర్యకో
రకితస్వాంతులు పౌరు లావటుని జేరన్ వత్తు రందందులన్.

"మీ కీభిక్షవృత్తి యేమిటికి? స్వామీ! రండు మాయింట మీ
కాకల్పించెద మిష్టమృష్టమధురాహారంబు" లం చెందఱో
యాకారింతురు వారి, నాతండు దదాహ్వానంబు నేనేమియో
సాకుల్ చెప్పుచుం ద్రోసిపుచ్చు గమనాసక్తుండు నా వెంటనే.

ఇట్టి కనుఱెప్పపాటులో నెల్లలోక
ములను బ్రసరించు తేజోవిభూతి ముదుక
కావిగుడ్డల నొకమూట గట్టి యిడిన
మాటువడి యుండునే వెఱ్ఱిమాట గాని.

ఒరు లెవ్వారు గ్రహింపకుండునటు లెంతో గుట్టుగాం బొట్టకై
తిరిపం బెత్తుచు సాగిపోవ మది నుద్దేశించెనే గాని సుం
దరరూపం బసమాన తేజము లసత్ప్రాండిత్య మా శ్రావణున్
బరికల్పించెం బ్రసిద్ధనామునిగం దత్తద్దేశమార్గమ్ములన్.

శాంతి వనము

తల్లిదండ్రుల సేవించు తలఁపులందుఁ
బరిణయముమాట మఱచిన బ్రహ్మచారి
ప్రచురకీర్త్యంగనాబాహుపంజరమున
దృఢతరమ్ముగ బలిమి బంధింపఁబడియె.

"విచ్చేయు స్వామి మాపీ" డని వీథులఁ
దోరణశ్రీ పసందుగ రచించి,
గుమిగూడి భయసంభ్రమములతో నెదురేఁగి
స్వాగతం బొసఁగి యంజలి ఘటించి
కొనితెచ్చి యిష్టాన్నమునఁ దృప్తి నొనరించి
హాయిగా విశ్రాంతి ననువుపఱచి
వితతవిద్యాపరిష్కృతలసద్ధర్మోప
దేశముల్ విను మహాదృష్టమంది.

ఎన్ని చెప్పిన నొకనాఁటికన్న వారు
నిలువనొప్పమి నేమియుఁ బలుకలేక
పీడలేక సుదూరము వెంబడించి
మఱలుచుందురు పౌరులు మార్గమందు.

"ఏమి గ్రహాచార మిట్లు స్వామీ! శ్రమంబు
పడఁగ నేఁటికిఁ? గావడి విడిచిపుచ్చి
వాహనంబులఁ బయనింపవచ్చు మీరు
కోరి యవ్వాని నర్పించుకొందు మేము"

అనుచుఁ దగు వాహనమ్ము లాయ త్తపఱుప
నభిలషించెడు ప్రజల దయార్ద్రమతుల
నరసి సుమధురమందహాసాంకురంబు-
లధరమునఁ జిందులాడ నిట్లను నతండు.

"జనని జనకుండు నారబండినఫలంబు
లట్ల యున్నారు— వీరి దేహమ్ములందు
ఎముకలే దక్క— రక్తమాంసములు లేవు
కుదుపులకు సైఁచునే వీరిముదిమి యిప్డు.

కావడి యందురా, యది సుఖమ్ముగ నే వహించెదు దానిలోఁ
బూవులఁ బెట్టినట్టు లలపుం బడకుండఁగఁ గూరుచుందు రీ
పావను, లీవిధంబు నిరపాయము వీరలసేవ యొండె నా
జీవితలక్ష్య, మేసుఖవిశేషముఁ గోరఁ దదన్యరీతులన్.

చేత నున్నది సర్వదాసిద్ధ మైన
కావడి— వహించుశక్తి పుష్కలముగాగ
బుజములం దున్న, దీరెంటి మూలఁ బెట్ట
నేల? వాహనసౌభాగ్య మేల మాకు?

పతరులను బెంచుపట్ల నేవెతయుఁ గాని
మెడఁదఁ దలపోయు దురదృష్ట మెప్డు నాకు
పుట్టకుండును గావుతఁ— బోవనిండు
భవదుదారత కివియె నావందనములు."

# శ్రావణము

తిరిగెం దేశము లొక్కటొక్కటిగఁ దత్తీర్థమ్ములం గ్రుంకుచున్
బరమానందము మీఱ వృద్ధపితృసేవాదీక్ష సాగించుచున్.
దిరిపంబెత్తుచు, నొక్కనాఁడు చనె వర్ణిస్వామి జ్యోతిష్మతీ
పురమున్ దక్షిణకోసలాభరణమున్ భూమీతలస్వర్గమున్.

---

# మధ్యమఖండము.

## నాలుగవ సర్గము.

ఒడల సాత్త్వికతేజ ముబికివచ్చినయట్లు
కమనీయభూతిరేఖలు సెలంగ
కరమున నిత్యోపగత మైనబ్రహ్మాసు
జ్ఞానంబువలెఁ గమండలువు మీఱ
బుజమునఁ జిరధృతాద్భుతదయాసత్యాస
వ్రతమట్లు బరువుగావడి యెసంగ
గళమున సర్వదాకలితమహా హరినామ
మాల నా రుద్రాక్షమాల యొప్ప

ఆత్మసౌందర్య మవగుంఠనావరోధ
ములకుఁ బైఁదాఁటి పండువెన్నెలలు గాయ
విశ్రమింపఁగఁ దగుచోటు వెదకికొనుచుఁ
బరువు లిడసాగెఁ బురవీథి బ్రహ్మచారి.

ఆతనిదివ్యతేజము శతాధికమై పసమించె నాఁటిప్రా
భాతికవేళ, లోకములపై నెసరేఁగిన యంధకార మన్
మూఁతఁ దెమల్చుచుం బసిడిపూఁతలఁ బెట్టిన బాలభానుఁడే
ప్రీతిఁ బ్రసన్నుఁడయ్యె ననిపించెఁ బురీజనచిత్తసీమలన్.

## శ్రావణము

ఆరతు లిచ్చువారు మరియాదగ వంగి నమస్కరించువా
రారమణీయనద్ధసుమహారములన్ మెడ వైచి తత్పదాం
భోరుహధూళి భక్తిభయముల్ చెలఁగం దలఁదాల్చువారునై
పౌరులు వేడ్కతో నుభయపార్శ్వముల న్నిబిడీకరింపఁగన్.

అతఁడు దూరస్థమైన పాంథాలయంబుఁ
జేరుకొని పితృపాదుల సేదఁ దీర్చ
సంభ్రమించుచుఁ బౌరపూజాప్రసక్తి
నాత్మఁ దలఁపఁడు కన్నెత్తి యరయఁ డట్లు.

పురవీథిం బయనించి తజ్జనులు గుంపుల్ గుంపులై వెంట రాఁ
బురమధ్యమ్మున నున్న రాజభవనమ్ముం దాఁటి తత్పార్శ్వమం
దరుదౌ తోఁటను దాఁటి యావెనుకఁ గన్యాంతఃపురోపాంతమున్
దరిసెన్ వైశ్యవటుండు గమ్యగమనోత్కంఠాపరాధీనుఁడై.

ఒక నూత్నవాసంతికోదయభ్రమమీఱఁ
దరులతల్ గ్రొత్తముస్తాబు నందె
ఒక కిసాలయపారణోత్సేక కాంక్షమై
పరభృతాంగన గొంతు సరదు కొనియె
ఒక శరచ్చంద్రచంద్రిక యని తలఁచి చ
కోరిక మగనిని కోరి పిలిచె,
ఒక సుధావృష్టి నభ్యూహించి ప్రాసాద
సాలభంజిక నోరు చప్పరించె

అనుపమము పావనంబు నత్యద్భుతంబు
విశ్వమోహనసత్కళా విలసితంబు
నైన వటుమూర్తిమహనీయమానసీయ
దివ్యమహిమంబు దెసల నర్తించునపుడు.

సరిగ నప్పుడె మేడయుప్పరిగ పైన
తత్పురాధీశతనయ సౌందర్యమూర్తి
ఇందిరాకన్య కొసరి లేయెండ సొబగు
నరయుచుండెను నెచ్చెలుల్ పరిచరింప.

చెలికత్తెల్ గుమిగూడి నిల్వ వదనశ్రీ విశ్వసమ్మోహనా
మలసౌందర్యముఁ జాట బాలరవిబింబమ్మున్నిరీక్షించు ను
జ్జ్వలభక్త్యాదరపూర్ణయై; యపరిపక్వం బైన తన్మానస
స్థలమం దెంతటి తీయదీయనగు కాంక్షాస్ఫూర్తి రేకెత్తెనో!

"భానునిలేవెలుం గమృతవాహినియై ప్రసరించి పద్మినీ
మానిని కింతమోదము సుమాళముగా ఘటియించె నద్దిరా!
మానితతన్మనఃకుహరమధ్యనిరూఢమరందపూరమున్
పూనిక నారగింపఁగల పున్నెము నేమధుపంబు గాంచునో?

మునరి వచ్చిన యళిజాతిఁ గసరికొట్టి
మూలఁ బడియుంటివో పద్మినీలలామ!
రాగవతి! నేఁడు నీయనురాగసుధను
కోరి దిగివచ్చునో నలకూబరుండు?"

అనుచు న్నెచ్చెలియొత్తు హాసముఖియై యన్యాపదేశంబుగాఁ
దనచిత్తమ్మును దూసిరా నొక బెడందం బెంచుచున్నంత నా
ననపద్మ మ్మొక వింతకాంతిఁ గనఁ గన్యారత్నమున్ వాడిచూ
పున నాథూ ర్తను మందలించి చనె గుంపున్ వీడి దూరంబుగా.

ప్రాసాదోపరిబాలభిత్తికఁ గరాగ్రం బాని మందస్మితా
వాసం బైన మొగమ్ము వంచి మది నస్పష్టమ్ములౌ భావముల్
వాసిం జెందఁగ నీషదానతతనూవల్లీప్రభల్ మింట శం
పాసాహస్రిక నీన వీథిఁ దెస కావర్తించె నక్షిద్వయిన్.

ఆ లావణ్యవతీశిరోమణి పరధ్యానమ్ముగా వీథిపై
పాలోకించి యదృచ్ఛచే నపుడు హర్మ్యప్రాంతమార్గమ్మునన్
లీలం గావడి మోయుచు న్నడచువానిన్ విశ్వసమ్మోహన
శ్రీలన్ మించినవాని శ్రావణునిఁ గాంచెన్ గుండె "జల్ జ"ల్లనన్.

అడఁగె మనసున సర్వేంద్రియప్రవృత్తి
మనసు నిస్తబ్ధమై సోగకనుల నడఁగెఁ;
గన్ను లా బ్రహ్మచారిమార్గమ్ముఁ బట్టెఁ
నామెదేహము పరవశ మయ్యె నిట్లు.

కలువదండల గళమునఁ గట్టెఁ గొన్ని
శిరముపైఁ బూలవాన వర్షించెఁ గొన్ని,
ప్రేమమధురంబు లైన తద్వీక్షణములు
బ్రహ్మవిద్యాపునీతమౌ వటుని మేన.

కాల మెఱిఁగిన కందర్పకర్షకుండు
తన్మనఃక్షేత్ర మప్పుడు స్నిగ్ధం బొనర్చి
ప్రేమబీజమ్ములం జల్లె నేమొ, యవ్వి
పులకలై మొలకెత్తె నప్పొలఁతిమేన.

అనురాగంబు సమీరణం బగుటఁ గన్యాసౌకుమార్యోల్లస
త్తనువల్లి న్వడకించె నయ్యది విచిత్రం బౌనె? — తత్కాలసం
జనితస్వేదము గండయుగ్మమును బ్రక్షాళింపఁగా నద్ది ప్రా
క్తనపత్రాంకము లెల్లఁ బోవఁగ విచిత్రం బయ్యెఁ గా కెంతయున్.

లీలమై మింట నొక్క శంపాలతాంగి
మెఱయుఁగావుత — నద్ది తామిస్రబహుళ
ప్రకృతులం దెల్లఁ బ్రసరింపవచ్చుఁ గాని
సత్ప్రకాశిత మగు చోట్లు చనఁగఁ గలదె?

తలను బైకెత్తఁ డన్యచింతలకుఁ బోఁడు
పితృభరణదీక్షఁ గొంచు దీపించు నతఁడు
గమ్యగమనోత్కలిక దక్క కానుపింప
దన్యభావంబు తద్వదనాంతరమున.

తమి బాలారుణమూర్తి దవ్వులనె సందర్శించి యాకాంత ప్రా
గ్రమణీరత్నమువోలె రాగవతియై రంజిల్లె, నాతండుమా
ర్గమునం బోవుచుఁ దన్ను దాఁటి చనువెన్కన్ వీడె రాగమ్ముఁ బ్రా
గ్రమణీరత్నము, తొంటిరాగ మతిమాత్రం బయ్యె నాచానకున్.

## శ్రావణము

దూరము వోవు నింకఁ గనుదోవలసైతము దాఁటిపోవు నన్
తీఱని చింతయొందు సుదతీమణికిన్ మదిఁ దొంటి మైకముల్
జాఱఁగఁబెట్టి— సిగ్గుపడి లాభము లే దని యామె యప్పుడే
కూరిమి నెచ్చెలిం బిలుచుకొన్నది తీయనికోర్కె లూరఁగన్.

దగ్గఱఁ దీసి నైజభుజదండముఁ దద్గళసీమ నానుచున్
సిగ్గుమొగమ్మునం జిఱుతచెమ్మట తుంపురులై స్రవింప లో
నగ్గల మైన వేడుక బయల్పడనీయక వెచ్చనూర్పులన్
బిగ్గబిగించి పల్కె మునివ్రేల పటోత్తముఁ జూపి యామెతో.

తరుణి! చూడవె భువనసుందరుఁ డొకండు
ముసలివగ్గులఁ గావడి మోసికొనుచు
నరుగుచున్నాఁడు వానిసోయగముతీరు
ఏమనందువె? మన్మథుఁడే! యతండు.

ధర సర్వాశ్రయమును బవిత్రమగు సౌందర్యంబు నేకత్రసు
స్థిరముం జేసి సృజించెనేమొ విధి— మూర్తీభూతమా శాంతివి
స్ఫురణం బిట్లు చెలంగెనేమొ, — సఖి! నాపుణ్యంబు లీరీతిగా
చిరసంప్రాప్తము లయ్యెనేమొ కను మా శ్రీమన్మనోజ్ఞాకృతిన్.

మానసికోత్సుకం బనుపమానము నీకడ దాఁచనేటికిన్
మానిని! యద్వితీయసుషమాప్రతిభాసితు శాంతమూర్తి నా
జ్ఞాననిధిం గనుంగొను క్షణమ్మునుండియు నస్వతంత్రనై
సూనశరార్తిఁ జిక్కితిని చూడవె యెట్టిపురానుబంధమో?

ఇది యేదో యొకచిత్రసంఘటన తన్వీ! కన్యనై స్వేచ్ఛగా
బ్రదుకంజూచిన నాదుచిత్తమె వికారస్పృష్టమై లోఁగె, నా
హృదయద్వారకవాటముల్ దెఱచినాఁడే! తెంపుమీఱన్ నవా
భ్యుదితప్రేమధనంబు దోఁచుకొని పోనున్నాఁడె యాతం డహో!

ఈతనికోసమేమొ సృజియించెను నన్ను విధాత, కానిచో
నాతలిదండ్రు లెన్ని జతనమ్ములు సల్పినఁ బెండ్లి యన్నచో
భీతిలుచుండియున్ నగరవీథులఁ గావడిమోయు వీనికై
చేతము పల్లటిల్ల నిటు చిక్కితి, నెంతవిచిత్రమే చెలీ!

నీయాక్షేపము కట్టిపెట్టు మిఁక తన్వీ! బిచ్చగాఁ డైన నే
మాయెన్? శాంతిగభీరమౌ మొగము దివ్యాకారమున్ వృద్ధపూ
జాయోగమ్మును వానిగొప్పఁదనమున్ జాటింపవా? యింతకున్
నాయుద్దేశము మాఱ దూరక యుపన్యాసమ్ము సాగింపకే.

పరువు ల్వెట్టవె వానివెంటనె, తదావాసస్థలం బేదియో
గుఱుతుం బట్టవె యూరుఁ జేరడుగవే గూఢంబుగా — నిట్లు దు
ర్భరదారిద్ర్యవిపన్నులై తిరుగ నేప్రారబ్ధమో సర్వమున్
సరిగాఁ బోయి గ్రహించిరాగదవె నీచాతుర్య మేపారఁగన్.

అతనివాల్లభ్యమునకుఁ దక్కితినయేని
నాబ్రదుకు తెల్లవాఱు నీనాఁటితోనె
పూని సాధింపవే, యమ్మ కైనఁ జెప్పు
మామె సాధించితీఱును ప్రేమ మీఱ.

అనుచు న్నెచ్చెలి నంపి రాజసుత యాశాధీనయై దానిరా
క నిరీక్షించుచు సర్వదాహృదయలగ్నుంబౌ వటుస్వామిమో
హనమూర్తిం దలపోయుచు న్నిజభవిష్యద్భాగ్య మూహించుచున్
గనులన్మూసి పరుండె రత్నరుచిదిగ్ధంబైన తల్పమ్మునన్.

శ్రావణుఁ డవ్వీథి న్నడచి సత్రము జేరి సభాస్థలమ్మునన్
గావడి దింపి నైజనయనప్రసరచ్ఛుభసత్త్వదీప్తిచేఁ
బావన మైన యంధపితృపాదచతుష్టయికి న్నివాళి స
ద్భావమునన్ రచించి కయిదండ యొసంగుచు దింపె వారలన్.

ఒకచో వారి మృదూపధానముల నాయోజించి యాసద్వ్రతుం
డకలంకమ్మగు భక్తిఁ దద్విపులమార్గాయాసముం దీర్ప ను
త్సుకుఁడై పాదము లొత్తి, వీచి, మధురోక్తుల్ మీఱ భాషించి త
ద్వికలస్వాంతము లింత తేరుకొనుగతిం గొల్చె నిస్తంద్రుఁడై.

కట్టా! సికుల్ తొలంగినవి గాని కడుంగడుఁ జీకియున్న యీ
కట్టెలు రెండు పోయినవి గా వొకనాఁడు వరప్రసాదుఁడై
పుట్టిన జ్ఞానమూర్తియగు పుత్త్రునిఁ బెండిలియాడువాని ని
క్కట్టులపాలు చేసితిమిగాదె నిరర్థకజీవితార్థమై.

అని మాతాపిత లప్రధృష్యతరదుఃఖాందోళిత స్వాంతులై
తనయున్ వైవధికుం దలంచి దురవస్థం దూఱుచున్ దీవ్రవే
దనులై మాటికి నేడ్వఁగా సుతుఁడు దత్కాలోచితోక్తిక్రమ
మ్మున నవ్వారల నూరడించి నెలకొల్పున్ శాంతిసౌభాగ్యమున్.

పితృచరణపూజ నిత్యదీక్షితుఁడు సుతుఁడు
శ్రమము దలఁపక యెంతయు త్సాహపడిన
ననుభవోన్నతి శతవృద్ధు లైన పితరు
లటమటింపరె వానిఁ గన్నారఁ గాంచి.

ఊరడించుచు శ్రద్ధతో నుపచరించి,
పూని వటుఁ డందు పితరుల స్నానభోజ
నముల నెఱవేర్చి తత్సమీపమునఁ దాను
నధివసించెను మధ్యాహ్నమయ్యె నంత.

రాగస్పృష్టకుమారికామతముపై రాద్ధాంతసిద్ధాంతముల్
సాగెన్ రాజగృహమ్మునన్, తుదకు వాత్సల్యమ్మునన్ కన్యకా
రాగమ్మం దగునంచు నొప్పెను మయూరధ్వాంతలాధీశ్వరుం
డాగంతుం బిలువంగ ధీరుని నమాత్యశ్రేష్ఠు నంపెన్ వడిన్.

పరివారం బొకయింత త న్ననుసరింపన్ మంత్రివర్యుండు స
త్వరుడై చేటిక త్రోవఁజూప నపుడే పాంథాలయం బేఁగి యం
దరుదారన్ బితృపాదపంకజసపర్యాతత్పరుండైన సు
స్థిరతేజస్కుని శ్రావణుం గనియె భక్తిన్ జిత్త ముప్పొంగఁగన్.

అతఁడు వినయాతినమితో త్తమాంగుఁడగుచు
వృద్ధులకు మ్రొక్కి బ్రహ్మచారిని నుతించి
స్వాగతోక్తులఁ బల్కి యంజలి ఘటించి
విన్నవించెను కోసలవిభుని యాజ్ఞ.

ఔరా! యేమిది, నన్నుఁ బిల్వ నొకకార్యం బున్న దే? దుష్పథ
ప్రారంభుం డగు గూఢచారి యని సంభావించెనో; కాక దు
ర్వారంబౌ నపరాధ మేదయిన మాపై మోఁప నుంకించెనో,
సారప్రజ్ఞుఁడ! బ్రహ్మచారిఁ బరిహాసం బాడుటల్ న్యాయమా?

ఆర్య! వృద్ధుల తీర్థయాత్రాభిలాష
దీర్ప నీరీతి దేశముల్ తిరుగుచున్న
బాటసారిని నే; నిట్టివానితోడ
నేమిపని యున్నదయ్య మీభూమిపతికి?

అతఁ డొకసార్వభౌముఁడు మహామతి! నే నొకబిచ్చగాఁడనై
బ్రతుకుచునున్న యల్పుఁడను బాపురె! న న్పిలువంగఁ గారణం
బతుకదు మానసమ్మునఁ— దదాలయమామకబ్రహ్మచర్యస
ద్వ్రతములకున్ రవంత యనుబంధము లేదు తలంచి చూచినన్.

దోషిగాఁ బిల్చెనో, యైన దోషమేమొ
చెప్పు మోమంత్రివర్య! వచ్చెదను నేను
కానిచో నిందు పితరులఁ గాసిపఱచి
రాఁదగదు నాకు మీతోడ రాజసభకు.

క్షమియింపం దగునయ్య! యంధపితృపూజాతృప్తినే గాని య
న్యము వాంఛింపదు నాస్వభావ— మిది యున్మాదంబుగా మీకుఁ
త్తమునం దోఁచును గాక దాన నొక బాధ్యత్వంబు నా కేల? ధ
ర్మము నూహింపుఁడు రాజమౌళికిఁ బ్రణామంబుల్ నివేదింపుఁడీ!

అనుచు రాజాజ్ఞ ధిక్కరించెను వటుండు
వృద్ధుఁ డాత్మజు నభిమతం బెఱిఁగి రాజ
మందిరమ్మున కాతని మంత్రివెంట
నంపుటకు నిశ్చయించి యిట్లనియె నపుడు.

తప్పు నాయన! యట్లనఁ దగదు మనకు
రాజధిక్కారమును జేయరాదు— శాస్త్ర
పండితుఁడవయ్యుఁ దగు ననుభవము లేమి
నట్టు లంటివి సవరింపు మామతంబు.

జ్ఞానవిశాలుఁడౌ నృపుని శాసనమున్ మనవంటివారు వ్యా
ఖ్యానము జేయరాదు, శిశువా! యది న్యాయముగూడ గాదు. "రా
జానుమతంబు ధర్మ" మను వ్యాప్తి యిప్పుడుపుట్టలేదు— నీ
ప్రాణము తద్వశంబు; బతనియాజ్ఞను మీఱఁగఁ జెల్ల దేరికిన్.

ప్రతివిషయంబు కారణనిబద్ధముగా వివరించి చూడలే
మతిగహనంబు రాజహృదయమ్ము, తదాజ్ఞను సర్వధర్మస
మ్మతముగ నిర్వహించుట సమంజస, మంతియెకాని తద్ధితా
హితములఁ జూడఁబోక మునువే నిరసించుట తప్పు బాలకా!

పొమ్ము నాయన! రాజగృహమ్ము జేర
ప్రభునియాదేశమును జెవిఁ బట్టనిమ్ము
వేచియుందుము నీకయి వేగ రమ్ము
ఎత్తుకొని పోరులే దొంగ లిచట మమ్ము.

అని క్షణమాత్రకోపలవ మాననమం దొక రేఖఁ దీర్చఁగా
జనకుఁడు మందలించె, నపచారము సైఁపఁగ వేడి పుత్రకుం
డనుమతిఁ గొంచు తత్పదములంటగ మ్రొక్కి ప్రసన్నభావుఁడై
చనుటకు నుద్యమించె వికసన్ముఖుఁడై సచివుండు పొంగఁగన్.

ఒల్లఁ డేవాహనముల, రాజోపయుక్త
లాంఛనమ్ముల నొల్లఁడు, లలితలలిత
శాంతితేజము మునుముందు గంతులిడఁగ
నడచి పయనించె మంత్రి వెంబడి వటుండు.

# మధ్యమఖండము.

## ఐదవసర్గము.

ప్రాసాదాంతరమందు రత్నఖచిత ప్రత్యగ్రసౌవర్ణపీ
ఠాసీనుం డగు రాజహాళి నిజకన్యాప్రేమనిష్పన్నమై
వాసింజెందిన నాఁటివృత్త మెదలో భావించుచున్నంత సు
శ్రీసంపన్నుఁడు బ్రహ్మచారి కనుపించెన్ దూరదూరమ్మునన్.

సంభ్రమాశ్చర్యచకితుఁ డాసార్వభౌముఁ
డవ్విశిష్టవ్రతకుని మేనియందఁ మరసి
లేచి యెదురేఁగి తత్సమయోచితముగ
స్వాగతోక్తులఁ బల్కి యాసనము జూపె.

రాజశ్రేష్ఠుని దూరమందె కనులారం జూచి తత్కాలవి
భ్రాజద్భక్తిభరంబుతోఁ స్వకులగోత్రజ్ఞప్తిపూర్వంబుగా
సాజంబౌ వినయమ్ము మీఱఁగ నమస్కారంబు గావించి యా
యోజస్వంతుఁడు పీఠ మొల్లక సమీపోర్విన్ సుఖాసీనుఁడై.

"ధరణీనాథ! భవత్పదాబ్జములఁ సందర్శించుభాగ్యంబు చే
కుఱుటం ధన్యుఁడనైతిఁ గాని కరుణాకూపార! మీప్రేమ పా
మరుఁడన్ వ్యర్థుఁడనైన నాపయి రహింపం గారణం బేమి? య
చ్చెరువై తోఁచెడిఁ బండితుండనో కవిశ్రేష్ఠుండనో, సత్ప్రభూ?

అనవద్యంబగు రాజధర్మమున దేవా! మీర లేమైన న
న్ననుమానించితిరేమొ దోషి యని; యట్లైనన్ సమూలమ్ముగాఁ
గనుగొండావిషయమ్ము నిప్పు, డదియుం గాకున్న స్పష్టమ్ముగాఁ
బని యేమో వివరించి పంపుఁడు విలంబమ్మయ్యె నా కిచ్చటన్.

పితరులను గ్రుడ్డివారి నేకతమ విడిచి
తరలి వచ్చితి మీయాజ్ఞ తలనుదాల్చి
వార లచ్చోట నెట్లున్నవారొ యనుచు
నటమటించుచు నున్నదయ్యా మనంబు"

వెనుకచూపు లోకించుక చెదరియున్న
స్వాంతమును వెల్లడింప సంభ్రమముతోడ
నిట్లు పల్కిన యయ్యమాయికునిఁ జూచి
ధరణినాథుఁడు పల్కె నాదరము మీఱ.

జాలే, బ్రహ్మవిదగ్రగణ్యా! భవదీయంబైన వృత్తాంత మా
మూలాగ్రమ్ముగ నే గ్రహించితి; విపద్భాయిష్ఠమై నీవు నే
నాలోచింపఁగ నర్హమై యొక రహస్యంబుంటఁ బిల్పించితిన్
ఓలిం ద్వత్పితృపూజకై భటులు కా పున్నారులే యచ్చటన్.

స్థిరమగు చిత్తముతో వసింపుము మనీషీ! నీవుప్రచ్ఛన్నతం
దిరుగం జూతువు కాని నీశుభవపుస్తేజంబు సర్వత్ర యం
కురితంబై ప్రకటించుచున్నది భవత్కాలంకషప్రజ్ఞ. సుం
దరుఁడా, యేఁటికి దాఁగఁజూచెదవు విద్వన్మౌళివై యుండియున్.

పండితుఁడఁ గాను కవి శేఖరుండఁ గాను
అనుచు నీ వాడినట్టి వాక్యములలోనె
యిమిడియున్నవి విద్యాత్మజా! త్వదీయ
భవ్యపాండిత్యసుకవితావైభవములు.

విబుధులఁ గవీశ్వరుల గౌరవించు టొకటి
తత్తదపరాధిశిక్షావిధాన మొకటి
కాక భూపాలునకు నన్యకార్య మేమి
యుండ దనుకొంటివో పండితుండ! నీవు ?

ధరణిని లేనిపోనిబెడఁదల్ తలఁదాల్చు నభాగ్యుఁడయ్య! యీ
ధరణిపుఁ డన్నవాఁడు పరతంత్రిత సుక్షిక్షిన మానవాధముం
డరయఁగ నట్టివాని కెప్పుడైన స్వకార్యము లుండవో? పరున్
దరియుట దోసమో? బుధనుతా! మఱి యచ్చెరు వయ్యె నీ కెటుల్?

వివరింపందగు నో కుమారక! భవద్వృత్తంబు, విద్వజ్జన
ప్రివరుల్ మీరలు దీనరూపముల యాత్రావ్యాజముం బూని యి
ట్లవనిం గ్రిమ్మర నేమి కారణము? గమ్యం బేమి మీ, కింతకున్
వివరింపం దగదేని చెప్పవల దా వృత్తం బముఖ్యం బిటన్.

ఏలా యిప్పటిదాఁక బెండ్లి యనుమాటే నీవు ముఖ్యమ్ముగా
నాలోచించిన జాడ లే దుచితవిద్యారూపసంపన్నయౌ
బాలారత్నము నేఁటిదాఁక లభియింపన్ లేదొ ? గార్హస్థ్యముం
బాలింపన్ మది నుత్సహింపవొ? పితృస్వాముల్ త్వరం గొల్పరో?.

## శ్రావణము

సద్గుణాలయ! విద్యల జ్ఞానమందు
భవ్యలావణ్యమున ననుపముఁడ వైన
నీకుఁ గన్నియ నిచ్చుపు న్నెమ్మికోఱకు
మనసుపడనట్టి కన్యకాజనకు లెవరు ?

బీదవాఁడ నటంచుఁ జెప్పెదవుకాని
'బీదతన' మన్నమాట యీ పృథివిలోన
ధనమునకె లంకె పెట్టఁగాఁ దగు నటంచు
అన్న! యేశాస్త్రములలోన నున్నదయ్యా?

అరయ గుణవంతుఁ డెంతభిక్షాధికారి
యైన నగుఁగాత నిర్భాగ్యుఁ డగునె యతఁడు ?
అట్లె గుణహీనుఁ డెంతలక్షాధికారి
యైన నగుఁగాత సద్భాగ్యుఁ డగునె యతఁడు ?

ఈ లేబ్రాయము మీఱఁబెట్టితివి ని న్నేమందు నయ్యారె! యు
త్కాలప్రజ్ఞ! భవత్ప్రవృత్తి కొక "ముక్కు న్మూలముం" గ్గలెనే?
నీలోఁ గొండొక మార్పు గల్గునెడ పెండ్లిం గూర్చి, నేనిప్పుడే
యాలోచించెద నింత నా కొసఁగలేవా యట్టి స్వాతంత్ర్యమున్?

రాజశేఖరసహజానురాగపూర్ణ
వచనములలోని యాంతరభావ మింత
తపులనేలేదు వటుని చిత్తంబునందు
నతఁడు నిస్పృహపడుచు నిట్లనియె తుదకు.

అనురాగమ్మున కైన హద్దొకటి లేదా స్వామి?—యెట్టెట్టులో
దినముల్ నెట్టు బికారినై నగరవీథిం బోవు నా పెండ్లిపై
త్తనముల్ దీర్పఁగ నుత్సహించితిరి చిత్రం బయ్యె మీవృత్తి—యే
మని ప్రత్యుత్తర మీయ నేర్చెదను దేవా! సంశయం బయ్యెడిన్.

వృద్ధపితృపాదు లంధు లీ యేను గూడ
తామసాంధుఁడ నిట్టి యంధత్రయంబు
తవిలియున్నది తీర్థయాత్రాప్రసక్తి
నమ్మ మోరాజ! దీన వ్యాజమ్ము లేదు.

నా పాండిత్యముఁ గూర్చి తా మొకయుపన్యాసంబు గావించినా
రోపృథ్వీపతి! యద్ది చాలెడిని స్నేహోదార మా మీ కృపా
రూపం— బంతియె గాని దుస్తరతమోరుద్ధాంతరంగుండనౌ
నాపైఁ జెల్లదు సుమ్ము—వెఱ్ఱిపడకయ్యా రాజచూడామణీ!

పెండిలి యటన్న బంధ మటుండ మొదట
రాజవర! నన్ను ప్రేమసూత్రములతోడఁ
గట్టఁ దలఁచితి రిట్టిబికారిపెండ్లి
కాకయుండిన మీ కేమి కష్టమయ్య?.

ధర "సంసారము సౌఖ్యపూర్ణ" మని సిద్ధాంతమ్ముగాఁ జెప్పువా
రరుదయ్యా జడతన్ గతానుగతికన్యాయంబునన్ సర్వదా
పరతత్త్వైకనిరోధకం బగు సుఖాభాసంబు వాంఛించి దు
ర్భరమౌ నాపద కోరి తెచ్చుకొను ధైర్యం బింత లే దోప్రభూ!

### శ్రావణము

బాలిక లేకకాదు— పితృపాదులతొందర లేకకాదు— భూ
పాలక! పెండ్లిమాట చెవిఁబట్టదు నా కెవ రెన్నిచెప్పినన్
ఏల వృథాశ్రమంబు తమ కిట్లు దయామయ? యానతిచ్చి నన్
వైళమ పోవనిండు పితృపాదసపర్యకు వేళ దాఁటెడిన్.

అనుచున్ శ్రావణుఁ డాత్మనిశ్చయము స్పష్టార్థముగాఁ జెప్పినం
తనె తత్ప్రాంతనిబద్ధహా యవనికాంతస్సీమఁ దత్కాలసం
జనితప్రేమవశమ్మునన్ సుమధుర స్వప్నమ్ములం గాంచు రా
ట్తనయారత్నము డిల్లనోయె తనయుత్సాం బెల్ల వహ్మాటచే.

రాజు తనయాత్మజాతమద్గతికి మిగుల
వగచి యాతనినిశ్చితభావ మింత
త్రిప్పఁ దలపోసి మానసోద్వేగ మెల్ల
నడచుకొని సాంత్వనోక్తుల ననియె నిట్లు.

అతివిజ్ఞానవిభాసమాన మగు వాక్యశ్రేణి నీనాఁడు పం
డితుఁడా! వింటిని ధన్యభావమును గంటిన్ నీగభీరోక్తులన్
ప్రతిభాసించెడి నర్థగౌరవము శబ్దస్ఫూర్తి—యుష్మన్మన
స్థితధర్మాభినివేశమున్ దెలియవచ్చెన్ మాకు తెల్లంబుగన్.

సంసారం బొక దుఃఖకూప మనువిశ్వాసంబుఁ, దత్పార్థవి
ధ్వంసాధాయక మన్న నమ్మికయు యుక్తం బౌనె?— నిర్ణిద్రమీ
మాంసాభిజ్ఞు లెఱుంగలేరె మును, లాత్మజ్ఞాని! వారెల్లరున్
సంసారంబులఁ బాసిరందువా గతుల్ సాధింపలే దందువో?

పెండిలియైన సద్గతి లభించుట సంశయ మంచు వేని యా
పెండిలి కానిచో నది లభించుట నిశ్చయ మంచు హేళ్కో, భూ
మండన! జ్ఞానమూర్తి యగు మాన్యుఁడు సద్గతి కేఁగు త్రోవలోఁ
బెండిలియడ్డువచ్చునె? వివేకులు మెత్తురె యిట్టిమాటలన్?

గడిబిడి చేయకయ్య వడుగా! యొకపెండిలిమాట యెత్తినన్
గడగడ లాడిపోయితివి గాని ముముక్షుఁడ వైననీకు నా
పడుటలు తప్పెనో? పితృసపర్యలు తప్పెనొ? నిద్ర తప్పెనో?
పుడమిని తత్త్వచింతకునిముక్తికి నియ్యవి సాధకమ్ములో?

కానీ యొక్కటి చెప్పు— మీశ్వరునిసంకల్పంబులో నర్థకా
మానంగీకృతి యున్న జాడ కలదయ్యా? యంద ఱిట్లైనచోఁ
తానై సృష్టిపథంబు కుంటువడిపోదా? ధర్మకామార్థసే
వాని స్తంద్రుఁడు ముక్తిదూరుఁ డని చెప్పన్ శక్యమా ధీనిధీ?

ఆలోచింపుము దూరదూరముగ గార్హస్థ్యమ్ములోఁ గూడ నీ
వాలంబింపఁగఁజాలు ధర్మములు లేవా? మేటిసౌఖ్యంబు లే
దా? లోకానుగుణప్రవృత్తి ననవద్యజ్ఞాన పూతమ్ముగాఁ
బాలింపం బ్రయతింపుమయ్య! యనురూపం బైనగార్హస్థ్యమ్మునన్,

మది నన్ స్వార్థపరాయణుం డని తలంపంబోకు మో సౌమ్య! చె
ప్పెద, యుష్మచ్ఛుభరూపసద్గుణవయోవిద్యానురూపమ్ముగా
పొదలున్ మామకపుత్త్రికామణి పురాపుణ్యైకరూపంబు— నా
హృదయం బూరక వేగిరించెడిని తండ్రీ! దాని నీ కీయఁగన్.

మా కది యేకపుత్రి యసమానసముజ్జ్వలసౌకుమార్యవి
ద్యాకమనీయరూప భవదర్పితచిత్తయు— నిట్టి కన్యకన్
జేకొను మిప్పుడే యధివసింపుము మామకరాజ్యపీఠి— సు
శ్రీకలితమ్ములౌ సుఖవిశేషము లందుము శాశ్వతమ్ముగన్.

అణుమాత్రమ్మును సంశయింపకుము సౌధాగ్రమ్మునందుండి స
ద్గుణమూర్తి న్నినుఁ గాంచినంతఁ బ్రణయోత్ఫుల్లాత్మ నీకోస మ
ర్పణముం జేసి భవత్కరగ్రహణమున్ వాంఛించు నాపుత్రికా
మణి నేఁడే గ్రహియింపు మీవిపులసామ్రాజ్యంబు కట్నంబుగా.

ఇన్ని నాళ్ళకు పెండిలి యన్నమాట
తలఁచినది యీమె భువనసుందరుని నిన్ను
వలచినది— పుత్రహీనునికులము నిల్పు
పున్నె మిందును పెండ్లాడు మన్న! దీని.

హృదయామోదము మీఱ మీ రతిసమృద్ధిన్ ప్రేమసామ్రాజ్యస
త్పదమున్ రాజ్యపదమ్ముఁ జేకొని సుఖింపఁ గోరుచున్నాఁడ, నా
యదలింపుల్ సయితమ్ము నుండ విదె మీస్వాధీనముం జేసి పె
ట్టెద రాజ్యమ్మును, పత్నితో వనికి నేఁడే పోయెదన్ స్వేచ్ఛమై.

పట్టుపఱుపులఁ గూర్చుండఁ బెట్టి పెనుపు
మయ్య! పితరుల— వారివంశాంకురంబు
నిలుపువిధమును జూడకుండినను నీదు
విమలభక్తికిఁ బూజకు విలువ యున్నె?

ఈమాటల్ వచియించునప్పుడు ధరాధీశాననాబ్జమ్మునన్
ప్రేమోద్వేగము దోఁచె, దుఃఖభరమున్ రేకెత్తె, నాశాంకురం
బామోదమ్మును మొల్కలెత్తె నతఁ డావ్యాయమ్ముగా శ్రావణున్
వేమాఱుల్ తిలకించె సస్మితము సాభిప్రాయమౌ దృష్టితో.

మిన్ను విఱుగుచు తనతలమీఁదఁ బడిన
యట్లు దోఁపఁగ శ్రావణుఁ డక్కజపడి
గుండెదడ మెల్లమెల్లఁగాఁ గుదురుపడఁగ
కోపలేశము దిగమ్రింగుకొనుచుఁ బలికె.

వలసినట్టులు మాటాడఁగలిగినట్టి
అనుభవజ్ఞులు మీరు రాజాధిరాజ!
బాల్యచాపల్యమైనను బాయనట్టి
జగము నెఱుఁగని యొకబ్రహ్మచారి నేను.

మీతో నేమని వాదమాడెదను స్వామీ! ధర్మసిద్ధాంతచ
ర్యాతత్త్వజ్ఞులు మీరు— మీవిపులశాస్త్రజ్ఞానమున్ కార్యర
ఝాతాత్పర్యము నద్భుతంబులు— ప్రసంగం బౌట నొక్కింత నా
కాతర్యంబును విన్నవింపఁగ నధీకారంబు గల్పింపరే?

నను మన్నింపుఁడు సార్వభౌమ! యెటులైనన్ స్వీయకార్యైకసా
ధనకై యింత యుపన్యసించితిరి పెద్దల్ మీర, లేతజ్జగ
జ్జనసాధారణమున్ సువిస్తృతము సంసారంపుమార్గం బధ
ర్మనిరూఢం బని యెవ్వ రందురు మహాత్మా! యుండె తారాడుచున్.

## శాంతి వనము

ప్రకృతిన్ మానవుఁ డన్నవాఁడు నిజకర్మగ్రస్తుఁడై యెంతగా
వికలుండై పడియున్నఁ గాని తనభావిం గూర్చి చింతింప వా
నికి స్వేచ్ఛానుభవప్రసక్తి లవమేనిన్ లేకపో దెప్పుడున్
ప్రకటంబై యొకజ్ఞానరేఖ యెదలో భాసించుటన్ భూవరా.

కరుణాసాగరుఁ డీశ్వరుం, డతనిసంకల్పంబులో మానవో
ద్ధరణ మ్మొక్కటె ముఖ్య, మందు పురుషార్థశ్రేణి విశ్వప్రజా
దరణీయ మ్మగుమార్గ మయ్యు విధిబద్ధం బంచు వాదింపఁగాఁ
దర మౌనే, యధికారిభేదభవభిన్నత్వంబు వారింతుమే?

అర్థమునఁ గామమున సక్తు లయ్యు ముక్తి
బడయువారల ప్రొక్కఁగావలయు గాని
అనుకరించుట యుపహాస్య మగును గాదె
అందఱు విదేహరాజన్యు లగుట యెట్లు?

ధర్మకామార్థతత్పరత్వమ్ముతో నె
ముక్తి సాధింపఁ గలిగిన పుణ్యమూర్తి
నూటి కొక్కఁడు సృష్టిలో కోటి కొకడు
నుండుఁ గావుత నంద ఱ ట్లుందురయ్య?

విడువఁ దలఁచిన విడువని విషయసుఖము
తనకుఁ దాఁ గోరి వరియింపఁ దగునటయ్య?
విషయదూరున కైన లభించనట్టి
ముక్తి సక్తున కె ట్లందఁబోలు నయ్య?

ధరణీనాథ! వచించితిన్ హృదయతత్త్వం బెల్ల స్పష్టమ్ముగా
తరుణంబౌట భవత్పదాబ్జములచెంతన్, గాని నాకోసమై
తెఱువంగాబడి యుండలే దిపుడు ముక్తిద్వారముల్ — నేను త
త్పరతన్ "మోక్షము మోక్ష" మంచుఁ బలవింపన్ లేదు నిక్కమ్ముగన్.

జనిపరంపర దోషలేశమ్ము లేక
గడచి శుద్ధాత్మదీప్తి చేపడినవెనుక
బడయఁదగినది నిర్వాణపదము — దాని
యందు మాదృశునకు వెఱ్ఱియాస లేల?

పితృపదమ్ముల నింత సేవించు టొకటి
చేతనైనంతలో లోకసేవ యొకటి
పరమలక్ష్యమ్ములుగ సదాబ్రహ్మచర్య
వ్రతము బూనగ నిశ్చయించితి మహాత్మ!

ఆధివ్యాధు లడంచు, సద్గుణపవిత్రాచారవిజ్ఞానముల్
సాధించున్, దురితాళి దూరముగ ద్రోలం జాలు, నత్యంతహా
మేధావృద్ధి నొసంగు, ముక్తివిభవానేయోన్నతింగూర్చు, భూ
నాథా! పావనబ్రహ్మచర్య — మది పూనం జెల్లదే యేరికిన్?

గృహియై ముక్తివిరుద్ధమైనయనురక్తిన్ దారపుత్రాదిభూ
ర్యహుఁడై చర్వితచర్వణోపమితకార్యవ్యగ్రుఁడై యూరకే
యిహమందుం బరమందుఁ జింతవడఁగా నేలా? ప్రశాంతమ్ముగా
మహనీయం బగు బ్రహ్మచర్యము ధరింపం జెల్లదే యేరికిన్?

## శాంతి వర్ణనము

ఈ బ్రదుకు నిట్లె సాగిపోనిమ్ము - రాజ!
ధర్మమొ యధర్మమో నిశ్చితమ్ము విడను
బ్రహ్మచర్యప్రమోదానుభవ మొకింత
అడుగిడఁగనీదు పెండ్లి దారు లందు నన్ను.

మీకన్యామణి కే ననర్హుఁడను భూమినాథ! వైవాహిక
శ్రీకై యువ్విళులూరువాని సమసౌశీల్యాన్వయప్రాభవ
ప్రాకట్యమ్మున నొప్పువాని వెదకింపన్ యుక్తమౌఁ గాని ని
శ్శ్రీకుం డైన విరాగి నెంతురె ధరిత్రిన్ గన్యకాబంధువుల్?

ఊరక "పెండిలి వలదు మొఱ్ఱో!" యటంచు
విముఖుడై యున్న నావంటి వెఱ్ఱివాని
కట్టుకొని రేపు మీముద్దుకన్య యైన
నేమి సుఖపడునయ్య? యూహింపుమయ్య!

బాలిక యామె యేయనుభవమ్మును లేమి భ్రమించె నాయెడ
పాలకవర్య! మీరు మృదుభాషల సర్వము నచ్చఁ జెప్పి యా
బాలికచిత్తమున్ మరలుపం దగుఁ గాని వ్రతస్థు నన్ను నీ
లీలఁ బ్రలోభపెట్టి యదలింపఁ దలంచుట యుక్తమా ప్రభూ?

ధనము పేరిటఁ గాలిబంధాలు వైచి
నిలువరింపఁగ నింక యత్నింపకయ్య!
ఆత్మవిధ్వంసకారణ మైనతుచ్ఛ
ధనముసంగతి యెవ రెఱుంగనిది రాజ?

ధనవంతుం డొకవేయిజన్మముల సందర్శింపఁగా లేనిపా
వనవిజ్ఞానము నర్ధజన్మమున సంపాదించు నత్యంతని
ర్ధనుఁడౌ మానవుఁ డుద్ధతత్వ మలసత్వం బింతలేకుంటచే—
ధనవంతుం గ్రసియించు నాంధ్యము మహోన్మాదంబు బాధిర్యమున్

ధనమదాంధత మది నంటుకొనినపిదప
పట్టుపఱుపులఁ గూర్చుండఁ బెట్టి పెనుపఁ
గలుగుదునో, లేక కూలివారలవశంబు
సలిపి విడుతునో తల్లిదండ్రులను నేను?

పట్టుపఱుపులఁ ద్రొక్కు-సంబరము లెల్ల
తొలఁగిపోయినవయ్యా! వృద్ధులకు మున్నె
కొడుకుఁ బ్రేమించి తల లూపుకొనుట కన్న
నన్యవిభవమ్ము వాంఛింపరయ్యా! వారు.

ఆచంద్రార్కము వంశము న్నిలుప సాధ్యం బౌనొకో గేహికిన్
నీచుం డైనకుమారకుం డొకడు జన్మింపంగఁ బ్రాచీన మ
ర్వాచీనం బగువంశమెల్ల నశియింపన్వచ్చు— పుత్రుల్ కుల
ప్రాచుర్యమ్మునకే జనింతు రని ధైర్యం బెట్లు భూమీపతీ?

జ్ఞానపుత్రునిఁ బడయంగజాలువాని
యన్వయం బొప్పు వేయికల్పావసాన
కాలములదాఁక— సంతియేగాని చిరము
పరిణయము నిల్పునే వంశవైభవమును?

## శ్రా వ ణ ము

కోసలనాథ! మీరిటులు కోరుట యుక్తము— కాని పెండిలిన్
రోసితి బ్రహ్మచర్యపదరూఢమనస్కత; నామతమ్మునన్
దోసము లున్న సైపుచు ననుజ్ఞ యొసంగిన పోయివత్తున
య్యా! నసిలేకయుంద్రు కొడుకా! యనియార్చుచు వృద్ధులచ్చటన్

అనుపమజ్ఞానసంభృత మైన వటుని
యాత్మనిశ్చయమునకు మా ఱాడలేక
కూతు పెండిలియాసలు కూలిపోవ
ప్రభువు గూర్చుండె నొకశిలాప్రతిమ యట్లు.

“ధరణీశా! సెల” వన్న మాటకు సమాధానమ్ము లేకుంట నా
తరుణుం డించుక సేపు నిల్చి పితృపాదమ్ముల్ మనోవీథిలో
స్ఫురియింపన్ నిలువంగలేక చకితాక్షుల్ స్వప్రయాణాధికా
తురతం జాట గమించిపోవుటకు నుద్యోగించి లేచెన్ వడిన్.

# మధ్యమఖండము

## ఆఱవసర్గము.

ఆతనిరూపసంపద శతాక్షులతోఁ దిలకించుచున్ వదీ
యాతతవాక్యముల్ శ్రుతిసహస్రముతో వినుచున్న కన్యయున్
ప్రాతతరప్రవృత్తి తనపున్నెము నింకొకమాఱు తానె చే
సేతల నిర్ణయించుకొనుచిత్తముతోఁ దెరఁ బాయఁద్రోయుచున్.

స్వర్ణకంకణనూపురస్వనము లెసఁగ
వేయిమెఱుపులు మెఱసిన విధము దోఁప
నీవలకు వచ్చి శ్రావణునెదుట నిల్చి
వినయమునఁ గేలు మోడ్చి యిట్లనియె నపుడు.

వేదాంతార్థనిరంతమ్మును మహావిజ్ఞానపూర్ణంబు నీ
వాదమ్మున్ ప్రతివాదబద్ధ మొనరింపం బూని నే నిందు రా
లే దో సుందరమూర్తి! నీశుభవపుర్లీలావిశేషంబు నా
కేదో మైకము తెచ్చిపెట్టినది హోయెం దాన నాలజ్జయున్.

'పరదా' వెన్క వసించి తావకమహోపన్యాస మాద్యంత మా
దరపూర్ణమ్ముగ వింటి— నీనిశితసిద్ధాంతమ్ములన్ మార్ప నా
తరముం గాదని తెల్లమైనది నితాంతం— బైనఁ గానిమ్ము సుం
దరుఁడా! యించుక చెప్పనిమ్ము గతపుణ్యాన్ నన్ను మన్నించుచున్

## శ్రా వ ణ ము

ఒక వైరాగ్యము చిత్తమం దుదితమై యుంటన్ ద్వదీయాచ్ఛదృ
ష్టికిఁ బ్రాపంచికభావముల్ వెగటుదోఁచెం గాని విశ్వప్రజా
ప్రకటీభూతము భూతమా ప్రణయభావమ్ము న్నిరోధించి యూ
రక మాటాడుట చెల్లునయ్యా సుకుమారా! హేతుశూన్యమ్ముగన్

పరమసుందర మగు సృష్టిపథమునందు
పురుషు లెందఱో స్త్రీలు నందఱు గదయ్యా
ప్రణయ మనునది ధర్మదూరంబ యేని
యేల స్త్రీపుంసభేద మీసృష్టిలోన?

ప్రణయ మేకైక కామానుభవనిబద్ధ
మైన నీ వన్నయట్లు నింద్యమ్మె గాని
హేతురహితంబు పావనం బిహపరైక
హర్షదం బైన నెట్లు కా దందువయ్యా?

ఇంతభయపడుచుంటి వెందేని కుటిల
దంపతులఁ గంటివేమొ వైధర్మ్యవృత్తి
నన్వయింపకుమయ్యా! నీయందు గూడ
బూచి గాదయ్యా పెండ్లాము బుధవరేణ్యా!

తల్లిం దండ్రిని బాసివచ్చి పతినే దైవమ్ముగా నెంచి మే
నుల్లం బాత్మయుఁ దత్పరమ్ములుగ నాయోజించి సుప్రేమమై
యిల్లున్ వాకిలి స్వర్గసంపదలతో నింపారఁగాఁ జేయదా
యిల్లా లన్నది? దాని రోయఁ బనియేమీ విజ్ఞుఁడా వానికిన్?

విభుఁడు విజ్ఞానసాధనాన్వేషణమునఁ
దవిలియుండఁగ సత్కళత్రంబు వాని
కష్టదగులదు తచ్చరణానుసరణ
శీలయై తానును దరింపఁ జాలుఁ గాని.

నీకోసంబని గంపెఁడాస పడియుంటిన్ — శైశవాభ్యస్తమున్
ప్రాకట్యంబు బగు ధీరతాపటిమ సర్వంబున్ భవద్దర్శనో
త్సేకంబందె యడంగిపోయినది — సుప్రేమమూర్తీ! నీకోడిదే
శోకం, బింక రనంత జాలి గొని యాలోచింపు మీ నాదశన్.

నీసేవార్థము తల్లిదండ్రులను గానీ రాజ్యసౌఖ్యమ్ముగా
నీ సర్వస్వము జీవితం బయినఁగానీ లిప్తమాత్రమ్ములో
నేసందేహము లేక వీడి యిప్పుడే యేతెంతు నీతోడ నీ
శ్రీసమ్మోహనముగ్ధరూపము నుపాసింతున్ గతోద్వేగనై.

రాజసుత నంచు లేదు గర్వంబు నాకు
దాసినై నీకు నీతలిదండ్రులకును
సేవఁ జేసెద — నేన మోసెదను నీదు
బరువుకావడి — పెట్టుము ప్రణయభిక్ష.

ఈసామ్రాజ్యపదంబు నీకెటులో యట్లే నాకునుం గూడ వి
శ్వాసం బీయదు దీని బాసిచని స్వేచ్ఛన్ వృద్ధపాదార్చనా
వ్యాసంగమ్మున సాగిపోదము భవద్వైజ్ఞానికాభ్యున్నతిన్
వీసమ్ముం దలక్రిందు చేయకయె పత్నీత్వంబు సాగించెదన్.

ఆనందం బనుమాట కర్థములు వ్యాఖ్యానమ్ములున్ భిన్నవి
జ్ఞానస్వీకృతవృత్తులై వఱలు నానాత్వమ్మునన్, గాని నా
యానందంబున కర్థ మేమనిన?— నీయర్థాంగినై తృప్తితో
ప్రాణంబుల్ ధరియించుటే— అది లభింపంజేయు మోధీనిధీ.

అవని స్త్రీకు భయావహం బయిన గార్హ్యస్థ్యమ్ములోఁ గూడ శాం
తివిశేషమ్మును సత్త్వవైభవము తృప్తిం గూర్చు, నాయుష్మికా
ధ్యవసాయమ్మును లోకసేవ పితృపాదద్వంద్వసేవామహా
త్సవమున్ జక్కఁగ సాగుఁ, జేకొనుము సంసారంబు నిర్భీతిగా.

అని యత్యంత ముపన్యసించుచునె కన్యారత్న మావర్ణితో
వెనువెంటం బయనింపసాగె— నతఁ డుద్విగ్నాత్ముఁడై యామె కే
మనియున్ మాఱువచింప నోడి పితృపాదాలోకనాసక్తుఁడై
చనియెన్ సత్వరవైఖరిన్ విపులరాజద్వారముల్ దాఁటుచున్.

పరువెత్తెన్ వెనువెంట భామిని వటుస్వామీ! జగన్మోహనా!
పరిచర్యారతయైన దాసిని త్యజింపన్ న్యాయమా? యంచు దు
ర్భరశోకమ్మున నార్చియార్చి తతమూర్ఛాగ్రస్తయై వ్రాలె సుం
దరరత్నోపలదీప్తిదిగ్ధవసుధాతల్పమ్మునన్ దీనతన్.

ప్రభుపీఠమున శిలాప్రతిమయై యున్న భూ
కాంతున కెడఁద మైకమ్ము తొలఁగె
ఆశ్చర్యనిర్నిమేషాక్షుఁడై ప్రాస్వడ్డ
రాజమంత్రికిని పరాకు వదలె

అంతఃపురాంతస్థ యగు రాజపత్నికి
సొబఁగు కాళ్ళెలలోన చుఱుకు పుట్టె
చాటుగా గుసగుసల్ సవరించు సఖులకుఁ
బరిచారికలకు సంభ్రమము కలిగె.

బ్రహ్మచారినిబద్ధ విపన్న నైజ
ప్రణయభావము హృదయకర్తనము గాఁగ
కన్యకామణి బేలయై కటికిరాతి
నేలపైఁ బడి మూర్ఛచే సోలినపుడు.

"అమ్మా! యేమని యూఱడింపఁగలనమ్మా, నిన్ను — ప్రాగ్జన్మక
ర్మమ్ముల్ వ్రేత్తుగఁ దాండవించినది, యుష్మజ్జీవితం బీగతిన్
వమ్మై పోయెను, ముద్దుమీఱు భవదుద్వాహంబు గావించుభా
గ్యమ్ముల్ లేవిఁక మాకు, బోధపడియెన్ గార్హస్థ్యపుంగత్తరల్.

ఎంత యనుభవశాలి వోయీ! నితాంత
పరిణతజ్ఞానమూర్తి! యో బ్రహ్మచారి!
కనులు దెఱవని శైశవకాలమందె
ఆకళించితి వయ్య గార్హస్థ్యబాధ.

బాపురే, బ్రహ్మచారి! నీపరిణయైక
విముఖభావము బుద్ధిచెప్పినది నిన్నుఁ
గన్నవారికి, నిన్ గోరుకొన్న యీమెఁ
గన్నమాకును, గార్హస్థ్యకాముకులకు.

# శ్రా వ ణ ము

నీకై పూచినపూవు నిచ్చట వృథా నిష్పిష్టముం జేసి యే
దో కన్పింపని దారికై వెదకు నోయున్మత్తుఁడా! బ్రహ్మచా
రీ! కానిమ్ము మదాత్మజాతకుతుకశ్రీ సర్వమున్ మాపి నీ
వే కల్యాణసమృద్ధిఁ గాంచఁగల వోయీ! విశ్వవిశ్వంభరన్.

ధరణీనాథవతంస మీగతి నపత్యప్రేమచే శోకని
ర్భరుఁడై కన్నుల నీరునింపుకొనె ధైర్యంబెల్లఁ బోనాడి— త
త్పరివారమ్ములు మెల్లఁగా మృదులతల్పస్థాపితం జేసి దు
ష్పరిణామాకుల కన్యకన్ విగతసంజ్ఞన్ జేర్చె రంతఃపురిన్.

# మధ్యమ ఖండము

## ఏడవ సర్గము.

ముగ్ధతర మైన పద్మినిమొగముసొగసు
మసకచీకటిముసుఁగులో మాటుపఱచి
ఆమెదైన్యము గనక ప్రయాణమయ్యె
నద్దిరా! లోకబాంధవుఁడా యతండు?

రాజభవనము దాఁటి బిఱాన వటుఁడు
హృదయ మావేగితముగాఁగ నెవ్వరేని
తఱుముకొని వత్తు రన్నట్లు పరువులెత్తె
తల్లిదండ్రుల పాదపద్మములకడకు.

"ఆలస్యమ్మున కేమికారణము, రాజాస్థానమందుండి తా
నేలా యిప్పటిదాఁక రా డెటులు పోయెన్ మాచిరంజీవి" యం
చాలోచించుచు నున్న వృద్ధుల కమందానంద మేపారఁగా
వ్రాలెం దత్పదపద్మసన్నిధి నిజప్రత్యాగతిం దెల్పుచున్.

ఏమి జరిగినదయ్యా తా జేల పిల్చె?
ననుచుఁ బ్రశ్నించు తండ్రికేమనియుఁ జెప్పఁ
జాలమిని సత్యధనుఁ డైన శ్రావణునకు
దిక్కుతోఁచక యుక్కిరిబిక్కి రయ్యె.

# శ్రావణము

ఈ యుదంతము వచియించె నేని తండ్రి
యప్పుడె శాసించితీఱుఁ బెండ్లాడు మంచు
ఏదియో బొంకి వచియింపఁడేని తనకు
సత్యభంగము గలుగు నిస్సంశయముగ.

అపుడొక్కించుక సంశయించుచు మహాత్మా! నాయెడన్ ఘోరమహా
నపచారమ్ము దలంచియే పిలిచినాఁడయ్యా మహారాజు మీ
కృపచే సర్వము దాఁటి వచ్చితిని కానిం డింక నిందున్న నే
విపరీతమ్ములో రాకమాన వని భావింతున్ యథార్థమ్ముగన్.

ఇతరం బేమియు పృచ్ఛ సేయకుఁడు తండ్రీ! తత్సభాస్థానసం
గతవృత్తాంతము లెల్లఁ జెప్పెదను మార్గంబందు మీ కంచు నా
యతభక్తిన్ సమయానుకూలపరిచర్యల్ దీర్చి విజ్ఞానమం
డితుఁ డాబ్రహ్మవిదుండు వేగముగఁ గట్టెన్ మూటయున్ ముల్లెయున్

ఒడయఁడు దూతలం బనుపునో, మతిమాలిన రాజకన్య వెం
బడునో, యటంచు సుంత యనుమానము దోఁప యథాపురంబుగా
మెడపయిఁ గావడిన్ సుఖసమీకృతముం బొనరించి కన్నులం
బొడుచు కఠోరమహా తిమిరముం గణుతింపక వీడె నాపురిన్.

ఘూకమ్ముల్ వికృతస్వరారభటి నాఘోషించు నవ్వేళ, హా
హాకారమ్ములయట్లు దారుణసృగాలారావముల్ దిక్కులన్
జీకాకుం బొనరించువేళఁ, బ్రతమోనీరంధ్రమహా వేళ, ను
ద్రేకావిష్టుఁడు బ్రహ్మచారి పరువెత్తెన్ దైవయోగమ్మునన్.

"ఊతమోహమార్గములయందు, నీపిశాచ
రాక్షసోచితవేళ, నిర్బంధవిధిగ
ఏమిపయనమ్మురా?— ధరాధీశుఁ డేమి
గొంతుగోయునో తెలవాఱెనంత మనల.

మృత్యుదేవత తనకబరీభరమ్ము
విప్పి లయతాండవము చేయువిధము నాకు
స్పష్టముగఁ దోఁచుచున్న— దిప్పట్టునందు
వలదు పయనమ్ము చూత మవ్వలివిధమ్ము".

అశుభోదర్కముగాఁ బ్రయాణ మిటు వ్యాఖ్యానించుచున్ భీవ్యథా
వశుఁడై వృద్ధుఁడు మాటిమాటి కిటు లాభాషించునే గాని యా
వశియా పుత్త్రుఁడు మానియై బదులుచెప్పంబోఁడు సర్వవ్యథా
ప్రశమార్థం బగు ధ్యానదీక్ష వినిపింపన్ లేదొ తద్వాక్యముల్?

వటునిహృదయంబు ధ్యానసంపన్నిరూఢ
మగుచునుండెనో?, రాజగృహప్రవృత్తి
నరయుచుండెనో?, కాకున్న నప్పు "డసలు"
హృదయమే లేదొ యతనికి నెవ్వఁ డెఱుఁగు?

శరవేగప్రవిసారితాంఘ్రియుగళీ సంపిష్ట బాలోపలో
త్కర, మస్పృష్టనిశాభయం, బగణితోద్యత్కంటకగ్రామ ము
ద్ధుర వేగాగతయాత హింస్రవనజంతువ్రాతసాశ్చర్య దృ
క్పరిదృష్టం బయి సాగె తద్గమన మప్రాప్తార్ధ్వఖేదమ్మునై.

## శాపవశము

పురము దాఁటి యుపాంతభూములను దాఁటి
దక్షిణోత్తరకోసలద్వయము గలియు
హద్దు దాఁటి ప్రవేశించె నాతఁ డొక్క-
ఘోరవిపినంబు దొలికోడికూఁతవేళ.

కన్ను మిన్నును గన్పడ కున్న వేళ
నిట్టు లాబ్రహ్మచారి పర్వెత్తుచుండ
అంతిపురమున రాజకన్యాలలామ
విహితపరిచర్యమై మూర్ఛ విడిచి లేచి.

గతవిషయమెల్ల సంస్మృతిగతము గాఁగ
క్రొయ్యవాఱినహృదయము కుదురుపఱచి
భారమౌఁ తైకఫలము లాభరణములను
ఒక్కటొక్కటి పని వట్టి యూడఁ బెఱికి.

ఏమేమో తలపోసి యచ్చటిసఖీబృందమ్ముఁ జీకాకుతో
సామీప్యమ్మును బాసి పొమ్మనుచు నాజ్ఞాపించి వాక్పూర్ణిణిన్
ప్రేమోదారులు తల్లిదండ్రులకు తృప్తింగూర్చి యవ్వారిచిం
తామాలిన్యము బాయఁద్రోలి భవనాంతస్సీమకుం బంపి తాన్

ఆవివిక్తావసథము గాఢాంధకార
సంవృతముఁ జేసి దీర్ఘనిశ్వాసఖిద్య
మానవక్షస్కయై వేపమానగాత్ర
లతికయై నిల్వలేక తల్పమున వ్రాలి.

సూనశరోపమాననవసుందరమూర్తిఁ దలంచి, తత్కృతా
నూనతిరస్కృతిం దలచి, యుజ్జ్వలశోకదవాగ్నితప్తయై
మానిని యేడ్వసాగె సుమమాసరసాలకిసాలఖాదనా
ధీనపికాంగనాగళకుత్రిస్తతిమాన కలస్వనమ్మునన్.

ఉష్ణనిశ్వాస తాపితాభ్యుక్షితాశ్రు
సిక్తతత్కన్యకాతల్పసీమ యపుడు
యుగపదాతప వర్షపాతోపలక్ష్య
మాణభూభాగమున కుపమానమయ్యె.

"ప్రేమోదు చిగురించె నీముఖాంభోజకలిత
చిన్మయస్నిగ్ధముగ్ధరోచిస్సుధాభి
షిక్తమై— కాని త్రుంచివైచితివి దాని
కఠినహృదయుఁడ! శుష్కతర్కప్రవీణ!

చారుగుణాఢ్యు నిన్ను వనసారు వరించితి నంటి— నీపదాం
భోరుహసేవకై సకలముం ద్యజియించెద నంటి— నింక నా
కోరిక రిత్తవోవ దనుకొంటిని— మామకభాగధేయముల్
కోరికతమ్ములయ్యె ననుకొంటిని— దైవము! మోసపోయితిన్.

తరుణీరత్న మనన్యచిత్త గుణవిద్యారూపసంపన్న నీ
చరణోపాంతమునందు నీకొఱకు మూర్ఛాగ్రస్తయై సోల ను
ద్ధురతం "జచ్చినఁ జావని" మ్మనుచు సంతోషమ్ముతో స్వేచ్ఛమై
పరువెత్తన్ మనసెట్టు లొప్పినదయా బ్రహ్మజ్ఞచూడామణీ!

ఆకారం బొకతీరు చిత్త మొకతీరై యొప్ప నేమేమియో
సాకుల్ చెప్పుచు మోసగించితివి నాస్వామీ! భవిష్యమ్మునం
దీకన్యాప్రణయప్రసంగ మొకనాఁ డేనిన్ భవచ్చిత్తమం
దాకల్పింపకపోదులే విపులరాగాంకూరమాధుర్యమున్?

పురుషగ్రామణి! కామినీహృదయసంభూతావమానవ్యథా
భరముం జక్కఁగ నాకళించుకొను సద్భావంబు నీబుద్ధికిన్
పరికల్పింపకపోదు దైవ, మపుడైన న్నన్ను బ్రేమార్ద్రిసు
స్థిరదృష్టిన్ గడు గారవింతు వనుచున్ జీవింతుఁ బేరాసతో.

త్వత్పదార్పితమైన దీతనువు, దీని
కరయ నీతోడిదే గతి యగును గాక
ఈపురీవాస మేల? యీ హేయసౌధ
తల్పసౌఖ్యము లేల వ్యర్థముగ నింక.

అని చింతించి నృపాత్మజాత చిరనిద్రాధీనమై మేనెఱుం
గని యాంతఃపురికంబు నెంతయుఁ బరీక్షాదృష్టి వీక్షించుచున్
జననీప్రావసథమ్మునన్ వెలయు నైశ్శబ్ద్యంబు గుర్తించి యా
ననసీమన్ దృఢనిశ్చయమ్ము విపులానందంబు నర్తింపఁగన్.

ఈయవకాశమున్ విడువ నేఁటికి?, నాప్రభు వెంబడించుచున్
జేయఁగలట్టి యత్నమును జేసెద నంచుఁ దలంచి యప్పుడే
స్వీయశరీరమున్ గృతకవేషవినీలపటావగుంఠన
శ్రీయుతముం బొనర్చి నడచె న్నిజసౌధము దాఁటి మెల్లఁగా.

కలితప్రేమవశమ్మునన్ వటుమణిన్ గాంక్షించి సోత్కంఠయై
యిలు దాఁటం బ్రయతించు కన్యకకు స్త్రీయైకాకినీత్వంబు లోఁ
దెలియన్ లేదు, తదేకజీవను లమందీభూతవాత్సల్యు లౌ
తలిదండ్రుల్ స్మరియింప లే, దిఁటులే గాదా కామినీవృత్తముల్?

కాలాంభోధరగూఢమా మెఱపుతీగం బోలి యా బాల ని
ర్వేలధ్వాంతమున న్మునింగి చరణశ్రీసౌకుమార్యమ్ము నే
నాలక్షింపని పూన్కితో నడచి యా యా రక్షకస్థానముల్
లీలం దాఁటి యుపాంతసత్రమున గాలించెన్ వటూత్తంసమున్.

నిద్రయును గాక మెలఁకువ నేనిఁ గాక
కునుకు నొకవృద్ధుఁ డేమియో గొణఁగుకొనుచు
"ఇపుడిపుడె వార లీదారి నేఁగినార"
లని వచింపఁగ నుద్వేగ మతిశయింప.

దీర్ఘతర మైనపురమువీథిని గమించి
కొదమచీకట్ల ఛేదించుకొనుచు బాల
నడచె నీలతరాంబరాంతరమునందు
నడచు కాదంబినీశోభ గడలుకొనఁగ.

మునుముం దించుక సవ్వడిన్ విని "వణిక్పుత్రుండె కావచ్చు" నం
చనుమానించును, కొంతద వ్వరిగి "కా" దంచున్ గడుం జింతిలున్!
వెనుకన్ జీమ చిటుక్కు మన్నఁ "దనకై వెన్నాడినా రెవ్వరో"
యని భీతిల్లును కొంతసే పరసి "కా" దంచుం జనుం బ్రీతితో,

ఎడనెడ దారిలోన నెవరే నెదురై "యెవరయ్య వార" లం
చడిగినఁ జక్కఁగా మొలచినట్లుగ నుత్తరమిచ్చు వారికిన్
గడుసుఁదనంబుతో, చకచక న్నడచున్, పనిబూని నేర్పుమై
యడుగును "కావడీని గనిరా తమ" రంచును బాటసారులన్.

వారు చనినట్టిత్రోవ నెవ్వరును జెప్పఁ
జాలకున్నను దైవవశమున నామె
ఏపురాకృతమో ప్రోత్సహింపఁ దుదకు
వారు చనినట్టిత్రోవ వెంబడినె చనియె.

గమనాత్యంతసుశిక్షితుం డగు వణిక్సంతాన మేమాత్రమున్
శ్రమ యన్నట్టిది లేక పర్వులిడె నుగ్రం బైన యాకానలో
గమనాశిక్షిత యయ్యుఁ గన్యక మహోత్కంఠాపరాధీనయై
శ్రమ లెక్కింపనిపూనికఁ బర్వులిడె నుగ్రం బైన యాకానలో.

శ్రావణము.

# మధ్యమఖండము.

## ఎనిమిదవ సర్గము.

"ఆఁగరా వెఱ్ఱితండ్రి! ప్రయాణ మెంత
కాలమని,— యెప్పు డెత్తినకావడి యిది?
నిద్రయెఱుఁగవు నిన్నఁ దించియును దినవు
అరరె! యిట్లైన మనియెదవా చిరంబు?

ప్రకృతిఁ గప్పినయంధకారంపుఁదెరలు
ఒక్కటొక్కటి దిగజాఱుచున్న వదిగొ
తూర్పు తెలవాఱె, నింక దుందుడుకునడక
విడిచి విశ్రాంతిఁ గొనుమయ్య వెఱ్ఱిబిడ్డ!

నడువంజాలక మిఱ్ఱుఁబల్లములలోనం దూలుచున్నావు నీ
యడుగుల్ మిక్కిలికందిపోయెడిని బిడ్డా! నాకు మీయమ్మకున్
పిడుచల్ గట్టినవయ్య నాలుకలు దప్పిన్ సైపలే మింక నీ
యడవి న్నీరు గలట్టిచో టరయు మాయాసంబు మెం డయ్యెడిన్.

"రానైయున్నది రాజమూలమున ఘోరంబౌ విప" త్తంచుఁ గా
దా నీవంటివి?— దాన దుర్భరపిపాసాధిక్యమున్ సైఁచుచున్
ప్రాణమ్ముల్ బిగబట్టుకొంటి, మిఁక సైఁపంజాలకున్నాము మ
త్ప్రాణార్థమ్ము రవంత నీరు గడియింపం దారి యోచింపరా.

ఇది యుషఃకాల మైనఁగానిమ్ము, సుంత
నీరు ద్రావక ప్రాణముల్ నిలువ వింక
నాయనా! వేగ మీ కమండలువు నిండ
తెమ్ము నీరమ్ము కావడి దింపు మిందు.

రాజభయ మింక లేదు తద్రాజ్యసీమ
బాసివచ్చితి ముత్తరకోసలంపు
కాన వియ్యవి దశరథక్ష్మాతలేంద్రు
ధర్మపాలనచే పునీతములు బిడ్డ!

తండ్రి యీరీతిఁ బ్రబలమౌ దప్పివాత
బడి వచింపఁగ నవ్వణిగ్వంశమౌళి
కటకటంబడి సంభ్రమకలితుఁ డగుచు
కావడిని దింపి వినయమ్ముతో వచించె.

అపచారమ్ము సహింపు మోజనక! యన్యాయత్త చిత్తుండనై
కృపణత్వమ్మున మీదు సేమమును గుర్తింపంగ లేనైతి— మీ
కృపయే తోడుగఁ బోయి యీవనతలం బెల్లన్ గవేషించి మీ
కుపకల్పింతు జలమ్ము— నందనుక నిం దుండం దగున్ భద్రులై.

హరిణమ్ముల్ మదహస్తియూథములు ద్రైయామప్రచారమ్ములం
బరిపూర్తిం బొనరించి యార్ద్రముఖముల్ భాసిల్ల నేతెంచెడిన్
సరయూతీరము నాతిదూర మని విశ్వాసంబు నా కయ్యె నో
కరుణామూర్తి! యనుజ్ఞ నిం డిపుడె యాకల్పింతు నీరమ్ములన్.

అనుచున్ వృద్ధుల వృక్షమూలమున నభ్యాసీనులం జేసి ప్రా
ర్తనముం జీర్ణము నౌ కమండలువు హస్తంబందు గీలించి వే
గనిరూఢిం బరువెత్తి మూఁతెఁడెనుటన్ గాంచెన్ బ్రశాంతోర్మిపా
వనవాఃపూరిత శూరా నదిన్ సరయువున్ బ్రత్యగ్రమోదమ్మునన్.

హర్ష విస్ఫారితాక్షుఁ డత్యంతపులకి
తాంగుఁడై తల్లిదండ్రులయాజ్ఞ దీస్చ
సంభ్రమమ్మున నన్యవిచార ముడిగి
జానుదఘ్నమ్ముగా నదిలోన దిగియె.

సరిగ నప్పుడె దశరథసార్వభౌము
డచట నొకయింతదూరమునందు "శబ్ద
వేధి" నామక మగునస్త్రవిద్యఁ గడఁగి
యభ్యసించుచు నుండె నత్యంతదీక్ష.

నీటన్ ముంచె మహోకమండలువు నానిర్భాగ్యుఁడౌ వర్ణి య
ప్పాటం బుట్టె "బుడుంబుడుం బుడుబుడు" స్వానమ్ము, లద్దాన నా
నీటం గొండొకహస్తి యున్నదని క్షోణీనాథుఁ డూహించుచున్
దాటించెన్ ఘనశబ్దవేధిశరముం దచ్ఛబ్దలక్ష్యమ్ముగన్.

ఆశర ముగ్రరూపమున నప్పటికప్పుడె తండ్రి యిడ్డ యా
దేశము దీర్ప నీరుగొని తీరముఖమ్ముగ వచ్చువాని వి
ద్యాశుభమూర్తి శ్రావణుని దాఁకె దృఢమ్ము విశాలమా నురో
దేశము నాఁటె హా! హతవిధీ! యని యాతఁడు నేలఁ గూలఁగన్.

## శ్రావణము

శ్రద్ధ యొసలార నూరేండ్లు సాముచేసి
మూల వట్టిన ముదుసలి కాలువిఱుగఁ
గొట్టినట్లుగ నుత్తరకోసలేంద్రుఁ
డతని బలివెట్టెఁ దన శరాభ్యాసమునకు.

శివశివా! యేమిపాప మిస్సీ! యటంచు
హరిహరీ! యేమిదారి హా! హా! యటంచు
బాధ సైఁపఁగఁజాల నబ్బా! యటంచు
చాపకట్టుగఁ బడియె నా శ్రావణుండు.

రక్తనది పాఱె హృదయగర్భమ్మునుండి—
జలమున సగంబు తలమున సగము గాఁగఁ
బడియె దేహంబు, ప్రాణముల్ పట్టుదప్పె
అర్ధమర్ధంబు చైతన్య మడఁగుచుండె.

"దైవమా! యెంతచేసి తర్థంబు లేదు
నీదుపనులకుఁ— దండ్రికి నీరు దేర
వచ్చితే మిట్లు బలిమిమైఁ జచ్చితేమి?
ధరణి నిక్లానె దురదృష్టతాండవములు?

ఆర 'ముగ్గిన' పండ్లు గతావలంబు
లైనపితరుల దారి యేమగునో యచట?
హరిహరీ! వారు నీరాస నటమటింప
నెవరు తీర్తురు రక్షింతు రెవ్వ రింక?

నార

అవురా! రాక్షసుఁడా! యెవఁడవురా నీవు
వృద్ధపరిచర్యతోనె జీవితము గడపు
బ్రహ్మచారిని నేమిలాభమ్ము గోరి
చంప సమకట్టితివిరా నిష్కారణముగ.

రాఘవేంద్రుఁడు దశరథరాజవరుఁడు
శాసనము చేయు ధర్మరాజ్యమ్మునందు
సైతమును మమ్ముఁబోలిన శాంతిబద్ధ
జీవనులఁ జంపు పండితుల్ చేరినారె?

అనుచున్ శ్రావణుఁ డానిశాతశరవిద్ధాంగుండు గొంతెత్తి రో
దనముం జేయుట యాలకించి తనయస్త్రం బేఁగి యారణ్యకున్
ముని నెవ్వానినొ సంహరించె నని యాందోళించి పర్వెత్తి యా
జననాథుం డటఁ గాంచె దారుణతరాస్త్రప్లావితున్ శ్రావణున్

అరరే! యేమిది, యెంతచేసితిని? బ్రహ్మఘ్నుండనై ఘోరమౌ
దురితంబుం గొనితెచ్చుకొంటిఁ— కులకీర్తుల్ నేఁటితో దుష్ప్రథా
పరిణామమ్మునఁ గ్రుంగిపోయినవి నిర్భాగ్యుండనై యస్త్రమున్
వరమౌనీంద్రకుమారహత్యకని సంపాదించినట్లయ్యె హా!

ఎవరునాయన! నీవు?— రఘువులకులము
చెఱుపఁ బుట్టిన నీచుని శరనిపాత
మునకు బలియైతి, వకట! యీ ముక్కుపచ్చ
లాఱనివయస్సులో నెంత యయ్యొ నీకు?

నేర్చితిని శబ్దవేధిని నిన్న మొన్నఁ
దత్పరీక్షకు నిచ్చట దాఁగి దాని
వనగజభ్రాంతి నీపయి వదలినాఁడ
ననఘ! నిన్ జంప నేర్చిన ట్లయ్యె దీని.

మునికుమార! విచారణా బుద్ధిలేక
వచ్చినదిగాని బుద్ధిపూర్వకముగాఁగ
వచ్చినది గాదు నేఁటిపాపంబు— నన్ను
సైతువో, లేక మాడ్తువో శాపవహ్ని.

రవికులమువాఁడ నజమహారాజసుతుఁడ
దశరథాఖ్యుండ నీ దురితమ్ముకొఱకు
పూని యీరాత్రి విల్లునమ్ముల ధరించి
తిరుగ వచ్చితి నీనదీతీరమునకు.

జననాథుం డిటు లాత్మదుష్క్రియకుఁ బశ్చాత్తాపనిర్విణ్ణుఁడై
యనినన్ వైశ్యవటుండు కంఠగత ప్రాణాంకురము ల్మెల్లఁగా
పనిగాఁగన్ బిగఁబట్టి వేదనకు నబ్బా! యంచు నెట్టెట్టులో
యనియెన్ శ్వాసనిరుద్ధ మౌచు నిజవాక్యశ్రేణి తొట్రిల్లగన్.

ఏడువకు రాజ! యెవ్వారి కెవరు కర్త
లాత్మకర్మానుగతి సర్వ మగునుగాక
నేను వచ్చుట, నీ వందు నిలిచియుంట
శరము విడుచుట, యివి దైవసాధితములు.

నామృతికి నాకె లేదు చింతాలవమ్ము
నీకుమాత్ర మదేఁటికో భూకళత్ర?
కాని నిన్నును నన్నును గలఁచి వైచు
విషయ మొక్కటి కలదు విన్పింతు వినుము.

అదిగో యాకనుపించుచెట్టుకడ నభ్యాసీనులై యంధులున్
ముదిమగ్గుల్ హతభాగ్యు తాపితరు లుద్యాభోగ్రతృడ్బాధచే
నదికి న్నీరము దేర నన్పనిపియున్నా రింతలోఁ జూడు నా
ప్రబుదు కి ట్లయ్యెను వారి కేమిఁగతి భూపా? యింక లోకమ్మునన్?

వారు మదేకమాత్రవిభవమ్మున నిప్పటిదాఁకఁ బోఁగుచు
న్నా, రదిగూడఁ బోయె జననాయక యవ్వలిమాట నూత మీ
జారతప్రాణముల్ నిలువఁజాలిన నాలుగుప్రూఁటలైన య
వ్వారికి నీరు నోయఁగలవారలు లే రెటుచూచినన్ ప్రభూ!

నే నిందాఁకను రాకయుంటి నని సందేహించుచున్ వార లెం
తేనిన్ భీతివిషణ్ణచిత్తులయి "తండ్రీ! యెంతజాగయ్యె, రా
రా! నీరంబుల కేమిలే!" యనుచు నాక్రందింతు రో భూపతీ!
ఈనిర్భాగ్యుఁడు లేనిచో నిలువ రావృద్ధుల్ నిమేషార్ధమున్.

దప్పికచేత వారు శతధా విలపించుచు నుందురయ్య! నేఁ
జెప్పఁగఁజాల రాజ! యిఁక జీవిత మెట్లును లేదు నాకు నీ
విప్పుడె పోయి వారలకు నిర్భరకుం దృష తీర్చి వెన్క నీ
ముప్పు వచింపు మావెనుకఁ బుట్టును పుట్టఁగఁబోవు నర్థముల్.

## శ్రావణము

పోవుచున్నవి ప్రాణముల్ భూమిపాల!
ఓర్వలేకుంటి బాధ— నీయుగ్రశరము
నూడఁదీయుము, సర్వబాధోపశమన
కారణం బగు పదమును జేరుకొందు.

ఆపంజాలనిఘోరదుర్వ్యథను వాక్యశ్రేణి సంరుద్ధమై
శోపన్ బ్రాణము లొక్కటొక్కటియు నుద్ధూతంబులై పోవ నా
యాపన్నగ్నుఁడు సోలుచుండఁ గని చింతాక్రాంతుఁడై కోసల
క్ష్మాపాలుండు తదంగవిద్ధశర ముద్ఘాటించెఁ గంపించుచున్.

కనుల మూసెను శాశ్వతమ్ముగ వణిక్సంతాన మాత్మేంద్రియా
ఘనికామోపరమమ్ము తేటవడఁ— గింక న్వ్యతామూఢుఁడై
జననాథుం డొకచోటఁ గూలబడి విశ్వంబెల్ల నాత్మావహే
లనసన్నద్ధము గాఁగఁ దోఁప నజహాల్లజ్ఞానమన్మోళియై.

ఈయలౌకిక తేజస్వి, కీనితాంత
ధర్మజీవికిఁ, బరిణతి దుర్మరణము!
అదియునాచేత— దైవమా! యనుచితంబు
నుచితమును లేదు నీదునియోగములకు.

ఇట్లు చింతించి చిరము మహీశ్వరుండు
అంధయుగ్మము మదిలోన నట్టె దోఁప
నులికిపడి లేచి చేకొని జలముపాత్ర
శ్రావణుశవమ్ము నిజభుజస్థమ్ము జేసె.

శ్రావణము.

# మధ్యమఖండము

ప్రొమ్మిదవ సర్గము.

దప్పిచే నాలుకల్ తడి యాఱి పోవంగ
మాటాడలేక సొమ్మసిలువారి
"జాగయ్యె బిడ్డ యెచ్చట నుండెనో" యని
యనిశంబు దహాతహాలాడువారి
"నాయనా! యెట్లుంటిరా!" యంచు గొంతెత్తి
విడువక కొడుకును బిలుచువారి
అపశకునమ్ములే యుపలక్షితము లౌట
నశుభశంకాభీతు లైనవారి

వృద్ధదంపతులను భయవివశుఁడగుచు
దవ్వులనె చూచి నిల్చి యాదశరథుండు
శవము నట దింపి చేకొని జలముపాత్ర
తత్సమీపము మందమందముగఁ జేరె.

ఔరా! వచ్చెను బిడ్డ— పాదతలవిన్యాసమ్ము లస్పష్టశ
బ్దారంభమ్మున; దోఁచుచున్నవి! కుమారా! యెంతజాగయ్యెరా
దారిన్ సేమముగానె వచ్చితివిగాదా, యీయరణ్యమ్మునన్
నీరమ్ముల్ లభియించెనేగదర తండ్రీ! మూన మిట్లేలరా?

పలుకకయుంటి వేమి శిశువా! మును పెన్నఁడు నేని యీగతిన్
బలుకకయుంటివా?— నిమిషమాత్రము మ మ్మెడబాసినంతనే
కలిగిన దీవిపర్యయము కారణ మారయఁజాలకుంటి నీ
స్థలమహిమమ్ముగా వలయుఁ దండ్రి! చలించెను నీగుణం బిటుల్.

ఔలే యీముదివగ్గులం బెనుచు వ్యర్థాయాస మెన్నాళ్ళు నీ
వాలంబింతువు వత్స?— నీయభిమతం బానందదం బయ్యె, న
ద్వేలంబయ్యెఁ బిపాస దీని మొదటం దీర్పన్ బ్రయత్నింపరా!
యాలోచింతము కార్యమవ్వలను బిడ్డా! యిమ్ము నీరున్నచో.

అని యాయంధుఁడు చేయి జాపె నృపుఁ డత్యంతమ్ము మహానవ్రత
బెనయన్ మెల్లగ నాకమండలువు నందిచ్చెన్— బిపాసాభర
మ్మున నాదంపతు లిర్వురున్ జలము నామూలమ్ముగాఁ ద్రావి ద్ర
క్తన మా దుస్థ్సితి వోవఁ దేరుకొని రుత్సాహాంకురం బేర్పడన్.

ప్రాంజలి ఘటించి తత్సమీపమ్మునందు
దశరథుండును గాలోచితజ్ఞుఁ డగుచు
కులము గోత్రము నామము దెలిసిరాఁగ
నంధులకుఁ బాదవందన మాచరించి.

అతియత్నమ్మున సాహసించి యతివేలాయాస వేగమ్మునన్
హాతకంతుండయి యశ్రువాహినులు నేత్రాంతమ్ములన్ జాఱఁగా
హతవర్ణస్వరమున్ సగద్గదము నౌ నల్పాల్పవాక్యాళితో
గతవృత్తాంతము నంధదంపతుల కాఖ్యానించె నామూలమున్.

“ఏమేమీ పసివాఁడు మీశరముచే నేమయ్యె నేమయ్యె?— రాజా! మాకొంపను గూల్చివైచితివి హా! హా! పుత్ర! హా! పుత్ర! తండ్రీ! మా కింక లభింపవా?” యనుచు నావృద్ధుల్ నితాంతవ్యథాభీమార్తస్వను లౌచు మూర్ఛమెయి నుర్విం గూలి రొక్కుమ్మడిన్.

సాంత్వనోక్తుల దశరథసార్వభౌముఁ
డనునయింపఁగఁ జిరకాలమునకు వారు
మెల్లమెల్లనఁ జైతన్యముల్లసిల్ల
లేచి తలలెత్తి యూరకే చూచిచూచి.

శివశివా! యేమి పాపంబు జేసినార
మఖిలకల్యాణగుణనిధి యార్యహితుఁడు
సర్వధర్మార్థవేదియా శ్రావణుండు
చిటికలో నిట్లు మమ్ము వంచించి పోయె?

ఏఁడీ మాకులరత్నదీప—, మతఁ డేఁడీ మాబహిఃప్రాణ— ముద్గాఢం బైనభవచ్ఛరాగ్నిఁ బడి లుప్తప్రాణుఁడై వెంటనే మాడెం గాక మదీయకర్మమున నోక్ష్మాపాల! యామేను నీ వేడం దాఁచితి వేమిచేసితివి తండ్రీ! మాకుఁ జూపింపవా?

కొడుకుదేహము దర్శింపఁ గోరి యిట్లు
ఏడ్చువృద్ధులఁ గోసలాధీశ్వరుండు
చేతు లందిచ్చి యెత్తి యాచెంతనున్న
శవము దాఁకించె వారిహస్తముల కంత.

కొడుకా! యంచు మహోచ్చకంఠముల నాక్రోశించి యాపీన్గుపైఁ
బడి దోఁగాడుచు నెత్తిమోదుకొని యాపాదంబు నామస్తమున్
వడకుంజేతుల సంస్పృశించుచు మహాబాష్పప్రపూరంబు పైఁ
దడుపన్ బోరున నేడ్చిరెంతయును పుత్రప్రేమ నాదంపతుల్.

"ఉంటి మీయిర్వురి కుమ్మడికన్ను నే"
నంచు మమ్ముల నూఱడించినాఁడు,
"పూని రక్తము దారవోసి పెంచెద" నంచు
చేయెత్తి శపథమ్ము చేసినాఁడు,
"మీవంతు గడచెను నావంతు వచ్చిన"
దంచు మమ్ముల నెత్తి పెంచినాఁడు,
గ్రామైకరాత్రదీక్షను గొని మము సర్వ
తీర్థదేశమ్ములఁ ద్రిప్పినాఁడు

పవలనక రాత్రియనక యీపాడునడిన
ముదిమిమేనులఁ గావడిమోసినాఁడు
తుట్టతుద కిట్లు మానీరువట్టు దీర్ప
నీరువట్టుచు పడి మరణించినాఁడు.

సంతతి లేమిచే మొరడుచావు లభించు నటంచు నెంతయున్
జింతలతోడనే సగముజీవితముల్ గడచన్న వెన్క మా
స్వాంతము లుబ్బఁ బుట్టితివి, చచ్చితి వీ యొకనాఁటిముచ్చటై
సంతతి లేక చచ్చుటె నిజం బయిపోయెను మాకుఁ బుత్రకా!

గురుభయమ్మున దక్షిణకోసలంబు
బాసి వచ్చియు నుత్తరకోసలేంద్ర
బారిపడితివి తండ్రి! నీప్రాణములకు
కోసలమ్ములు మృత్యువుకోఱ లయ్యె.

కర్మగతిగాని యీవేళగానివేళ
దప్పిక యిదేమి? మాను నాత్రమ్ము నేమి?
నీవు పర్వెత్తు టేమి? తండ్రీ! తలంచి
క్రోసిన ట్లయ్యె నిన్ను మృత్యువున కెదురు.

తల్లిదండ్రులసేవలోఁ దవిలి విశ్వ
మెల్ల మఱచిన సాధుమూర్తీ! స్వమూర్తి
పితరులపిశాచతృష్ణ కాహుతి యొనర్చి
క్షుద్రపితృభక్తి కంతము చూచినావు.

ధర్మపరిణతి వేదనాంతం, బనేక
కష్టనిష్ఠురతరము నై స్పష్టముగను
గ్రుడ్డికన్నుల కేనియు గోచరించె
నాకు, నీవంటికొడుకు వినష్టుఁడగుట.

"ధర్మ మిహపరసౌఖ్యవర్ధక" మటంచు
విదితవేద్యులు గొప్పచెప్పుదురు గాని
యిహసుఖం బెల్ల నిట్లయ్యె నింకఁ బరము
ఉండినను నేమి "యసలు" లేకున్న నేమి?

## శ్రావణము

ధర్మము నధర్మ మని తారతమ్య మెపుడు
వలదు ప్రాణికి— ధర్మసేవానిరూఢ
జీవితమ్ములు నిట్లు వంచింపఁబడియె
నహాహా! ధర్మమ! నీకు జోహారు లింక.

అనుచున్ వృద్ధుఁడు పుత్రశోకకలితానల్పవ్యథోన్మత్తుఁడై
వనులన్ శైలములన్ ప్రతిధ్వని రహింపం బత్నియుం దాను హా!
యని రోదించుచు సమ్మూర్ఛనుని సుతప్రాణాంతకున్ భూపతిన్
ఘనకోపాగ్నిని నిర్దహించునటు లుగ్రంపశ్యుఁడై యిట్లనెన్.

"ఔర! రాఘువవంశోద్భవా! కిరాత!
ఇతఁడు మాయేకపుత్రకుం, డితనితోడఁ
దవిలియున్నది మాజీవితంపుసూత్ర
మకట! బలిగొంటి వితని నీయస్త్రమునకు.

విద్య నేర్చిన యోయవివేకి! నేఁడు
కనులుగలిగిన యంధశిఖామణి వయి
నీవు చేసిన తప్పు మానెత్తి పైన
తాండవించెను కులము విధ్వస్తమయ్యె.

"వనగజభ్రాంతి నీముప్పు వచ్చె" నంచు
నేలచెప్పెద— వీయుషఃకాలమందు
నీరు ద్రావు మృగమ్ములఁ గోరి చంప
నేమి ధర్మము నీకైన నెవరికైన?

మధ్యమఖండము.—

మత్తుఁడవై పవిత్రసుషమాప్రతిభాసితు నాకుమారు స
ర్వోత్తమునిన్ వధించినయయోగ్యతకుం దగు శిక్షవెట్టి నీ
చిత్తములోన నీచెడుగుఁజేఁతల సంస్మృతి జీవితాంతమున్
హత్తెడునట్లు చేయఁదగురా శిశుఘాతుక! యంధభూపతీ!

కొడుకును బెంచిపెంచి తుదకున్ గతిలేక యపుత్త్రికంబుగా
మఱియునవస్థ దెచ్చితివి మానవనాయక! మాకుఁ — గావునన్
కొడుకులు చింతలేని యొకఘోరవిపద్దశ ముగ్గి ప్రాణముల్
విడుతువుగాక నీవు పలవించుచుఁ బుత్త్రిలకోస మెంతయున్.

తత్కాలస్ఫురితోగ్రకోపమునఁ బుత్త్రధ్వంసియా భూపు ను
ద్వృత్త్కారిన్ శపియించె దైవగతి నిట్లా విశ్వనాథుండు — భీ
త్యాత్యంతావశమైన నై పడఁక నాయుర్వేశుఁడున్ భక్తిభా
వోత్కర్షమ్మునఁ దత్పదాబ్జముల నాయోజించె శీర్షం బొగిన్.

క్షణకోపుండగు విశ్వనాథుఁడు కృపాశాంతాత్ముఁడై ప్రోల్లస
న్మణిబద్ధంబు కిరీట మాత్మపదయుగ్మంబందు నర్తించుకా
రణ మూహించి హతాత్త్రపభూత మగుసంభ్రాంతిన్ రఘూత్తంస! రా
ణ్మణీ! నాపాదము లంటరాకుము మహాత్మా! యంచు వారించుచున్.

దుఃఖకోపమ్ము లాత్మవిద్రోహకరము
లగుట యెఱుఁగుదు రాజరాజా! దురంత
పుత్త్రశోకము నాబుద్ధి బుగ్గి జేసి
పిచ్చి యెత్తించెఁ దనయిచ్చవచ్చినట్లు.

## శ్రావణము

మాపైఁ గోపము మాను మో నృపతి! బ్రహ్మఘ్నుం డట నంచున్ వృథా
పాపోవం బనిలేదు వైశ్యులకుటుంబ మ్మిద్ది— మద్దత్తమా
శాపమ్ముం దలపోసి కుందకుము నిన్నంతానఘున్నుండవౌ
నీపాలన్ వరమా నొకప్పు డిది సందేహమ్ము లే దింతయున్.

మానుదుటవ్రాఁత నేఁటి కిట్లైనదయ్య!
ఎవరి నేమందు?— నిపుడు మా యేకపుత్త్రి
ననుగమించుటకన్న మార్గాంతరంబు
లేదు మా కింక రాజమౌళీ! తలంప.

వాఁడేమో విబుధాగ్రగణ్యుఁడయి విశ్వఖ్యాతి నార్జించి వే
యేఁడుల్ వర్ధిలు నంచు పొంగితిమి మే మిన్నాళ్ళు— నీనాఁడు మా
మేడల్ గూలిన వీపయిన్ బ్రదుకుచున్ మేమింక నేవేడుకల్
చూడంగావలె, నేమిచేయవలె నాలోచింపు మో భూపతీ!

అనుచు మర్త్యవ్యకృతనిశ్చయంబు దెలిపి
యతఁడు దశరథదత్తహస్తావలంబుఁ
డగుచుఁ బత్నియుఁ దాను శ్రద్ధాత్ము లగుచు
స్వచ్ఛపావనజలముల స్నానమాడి.

"మాకు నీర్వోసి యుత్తమలోకము లిడ
నర్హుఁ డగువాని కకట! మేమై నివాప
మిచ్చుదౌర్భాగ్య మొదవె నిస్సీ! ప్రతీప
పథము బట్టెను మాపాడుబ్రదుకు" లనుచు.

చిరము చింతించి తుదకు సంస్మృతిరహింప
రాజసాహాయ్య మంది పుత్త్రికున కపుడు
ఔర్ధ్వదైహికవిధులఁ దా నాచరింపఁ
బ్రేతము చితాగ్నిహోత్రసంస్కృతము జేసి.

తాను ముమూర్షుఁడై దశరథప్రతివాదము ద్రోసిపుచ్చుచున్
మానసశాంతికై తనకుమారుచరిత్రల నొండునొండుగా
నానృపమౌళిచెంగట సహస్రవిధమ్ములఁ జెప్పిచెప్పి వ్యా
ఖ్యానము చేయుచుండె సహజాదరమేదురగద్గదోక్తులన్.

# మధ్యమఖండము.

## పదియవసర్గము.

జ్ఞానవిజ్ఞాననిధానుండు సర్వవి
ద్యాభూషణుఁడు పావనాశయుండు
శతకోటిమన్మథసౌందర్యలావణ్య
మధిగమించు కళామయస్వరూపుఁ
డంధులౌ పితరుల నతివృద్ధులను బేర్మిఁ
గావడిఁ గొని మోయు ఘనగుణుండు
రహిమించు నన్నపూర్ణావిశ్వనాథుల
కులదీపకుండగు కూర్మికొడుకు

సాత్త్వికబ్రహ్మతేజస్వి శాంతిమయుఁడు
శ్రావణాహ్వయుఁ డగు బ్రహ్మచారి యొకఁడు
వచ్చె నీదారి మీకంటఁ బడెనె చెప్పఁ
డో పథికులార! ప్రేమస్వరూపులార!

స్నేహవతి నైననన్ను వంచించినాఁడు
ముచ్చువలె నిట్లు పర్వెత్తి వచ్చినాఁడు
నావిభుఁ డతండు నామనోదైవ మతఁడు
ఇట్లు రాలేదు గద చెప్పరేమి మీరు?

అనుచుం గ్రేవల హీనులం బడియె నార్తాలాపవిస్పష్టమై
వనితాకంఠ మొకండు, సంభ్రమభయభ్రాంతాత్ములై వృద్ధులున్
జననాథుండును చూచుచుండఁగనె యాశ్చర్యమ్ముగా నాక్షణ
మ్మున నచ్చోటికి వచ్చె నింవిర శ్రమాంబుస్విన్నసర్వాంగియై.

వృద్ధుల్ శ్రావణనామసంస్మరణనిర్వ్యక్తవ్యథాభారసం
రుద్ధప్రాణులు ముక్తకంఠులయి యాక్రోశింపఁగా విస్మయా
విద్ధాత్ముం డగు కోసలాధిపుఁడు నిర్విణ్ణోక్తి నెట్టెట్టులో
వృద్ధద్వంద్వము నూఱడించుచు నిటుల్ పృచ్ఛించెఁ గన్యామణిన్.

"ఎవ్వతె వీవు బిడ్డ! యిటు లేఁటికి వచ్చితి వొంటి, శ్రావణుం
డెవ్విధి మోసగించె "నస" లేమి మునింగెను మీకుమీకు, నీ
యవ్వను దాతనే నెఱుఁగవా?"— యని వృద్ధులఁ జూపి వెంటనే
యవ్వసుధేశుఁ డుత్తరము నందెను చక్కఁగ తన్మృదూక్తులన్.

తనవృత్తాంతము సర్వముం దెలిపి యాతన్వంగి వృద్ధద్వయ
మ్మును దచ్ఛ్రావణబంధు లంచు మది నభ్యూహించి యాయూహమున్
జననాథోక్తి స్థిరీకరించి తనప్రాణస్వామి కన్పింపకుం
ట నితాంతమ్మును వ్యగ్రయై కనులవెంటన్ బాష్ప ముప్పొంగఁగన్.

ఏఁడి నాస్వామి—, యేఁడి నాహృదయహారుఁడు?—
ఎచట దాఁచితిరో చూపరేమి నాకు?
ఏలయేడ్తురు? నావిభుం డేమియయ్యె?
నేమియయ్యె మఱేమయ్యె నేమియయ్యె?

దుడుకుంజిత్తమమంగళశ్రుతుల నాందోళింపఁగా నిట్లనెన్
గడు నుద్వేగము మీఱ నాలలన— భాగ్యభ్రష్టులౌ దంపతుల్
కొడుకా! యంచును గుండియల్ పగుల నాక్రోశించి — రాయేడ్పులోఁ
బిడుగుం బోలిన వార్త యిందిరకు విన్పించెన్ యథారూపమై.

విగతభర్తృక యైన యావెలఁదిమిన్న
విగతధైర్యయు విగతవివేక యగుచు
ఎడఁద పగులఁగ గొంతెత్తి యేడ్చియేడ్చి
ధరణిపైఁ బడె విగతచైతన్య యగుచు.

ఈయాకస్మిక మైన సంఘటన నుర్వీశుండు నున్మత్తుఁడై
పోయెన్— పుత్త్రినిఁ గూర్చి నూత్న విషయమ్ముల్ విన్న వృద్ధుండు హా!
హా! యంచున్ శతవృద్ధశోకమునఁ గన్యాప్రాంతముం జేరి యా
ప్యాయ మ్మొప్పఁగ నామెమై నిమిరి యేడ్వన్ సాగె నీరీతిగా.

"ఈరత్నంబు లభించునంతటిమహాదృష్టమ్ము నావంటి పా
పారంభుండగువాని వంశమున కేలా కల్గు?— నీవంటి వి
స్తారప్రజ్ఞుఁడు నెట్లు దక్కును?— తటిత్ప్రాయమ్ముగా జీవితా
శారూపం బయి వెల్గె నీవెలుగు నిప్పాఁ—ంతంబు నయ్యోన్ ద్రుటిన్.

రానై యున్నది రాజమూలమున ఘోరంబౌ విపత్తంచు నీ
వానాఁ డన్నది నేఁడు బోధపడె నత్యంతానురాగమ్ముతో
దానై వచ్చిన రాజపుత్రిని బలాత్కారమ్ముగా గెంటినా
వీనిర్భాగ్యులసేవకోసమని తండ్రీ! యంధభక్తుండవై.

ప్రాణపణ మైన నీపితృభక్తిదీక్ష
ప్రాణములతోనె తుదకు సమాప్తమయ్యె
ధర్మవర్తిత మైననీతనువు నేఁడు
ధర్మనిర్వాహణార్థమే దగ్ధ మయ్యె.

అకట! యేమందు రాజ! చెట్టంతకొడుకు
ఉత్తముఁడు నాకు తుదకు లేకుండఁ బోయె
వానిఁ బోఁ బోక యీపాడుమేను లిట్లు
పుచ్చఁబెట్టుచుఁ గూర్చుండె నిచ్చగింప.

ధరణీనాథ! కృపామతీ! యిట ననాథప్రేతసంస్కారముల్
పరిపూర్తిం బొనరింపు" మంచు నృపు నభ్యర్థించి వృద్ధుండు స
త్వరుఁడై పత్నియుఁ దాను వాయువుల నిర్బంధించి యోగమ్మునన్
చిరజీర్ణ మ్మగుజీవితమ్మును త్యజించెన్ లిప్తమాత్రమ్ములో.

మహీనాథుండు తదీయజీవితవిరామవ్యక్త మహాయోగస
న్మహిమం జూచి నితాంతవిస్మయపరీతం బైన చిత్తంబునన్
ముహురావర్తితతచ్చరిత్రుఁ డయి సమ్మూఢాత్ముఁడై యుండఁగా
సహసాభ్యుత్థిత యయ్యె రాజసుత మూర్ఛావేగనిర్ముక్తయై.

"ఇదియా నిర్మలసాధుజీవితఫలం, బీపాటిదా బ్రహ్మచ
ర్యదశాపర్యవసాన, మిట్టిదియె ధర్మంపుం బరీణామ, మి
ట్టిదె బ్రహ్మజ్ఞనిరీక్ష కోవ?— దైవమ! యకుంఠీభూతవృద్ధార్చనా
స్పద మా పావనజీవితం బిటు సమాప్తం బయ్యెనే భ్రష్టమై?

# శ్రావణము

తొలుతన్ మామకజీవితాంతరమునందున్ నూతనాశాంకుర
మ్ములఁ గల్పించి క్షణమ్ములోన నవి యున్మూలించి యేనాఁటికేన్
ఫలియించున్ సుకృతం బటంచు నతితృష్ణన్ మించు నామానస
స్థలమే మాడ్చితి విట్లు— తీఱెనొకో దుర్దైవంబ! నీపంతముల్?

నీ కీతొందర యేలవచ్చినది తండ్రీ! కోసలాధీశ్వరా!
ఆకల్యాణగుణాబ్ధికిన్ దగినచావా! యిద్ది?— మిథ్యాశ్రుతిన్
నీకర్ణమ్ములు మోసపుచ్చ, నటుపై నిర్ణిద్రరూపమ్ములై
నాకర్మమ్ములు తోడుసూపఁగ పరిణామంబు లిట్లయ్యె హా!

నేనున్ వీరలతోనె వచ్చితినయేనిన్ వృద్ధసేవార్థమై
యా నాస్వామిని పోవనిత్తునకటా?— నేనై పోయియుందున్ నృపా
లా! నీగాఢశిలీముఖాగ్నిఁ బడి ధన్యత్వమ్ము నార్జింపఁగా
ప్రాణమ్ముల్ త్యజియించియుందు— నది తాత్మాఱెయ్యె నీరీతిగన్.

మనసార న్నిను జూడనైతిని— సుధామాధుర్యముల్ నీనుడుల్
తనివోవన్ విననైతి— నీహృదయసౌధంబుం బ్రవేశించుపా
వనభాగ్యమ్ము గడింపలేనయితి— నో ప్రాణేశ! నీయంత్యద
ర్శన మైనం బొనరింపలేనయితి— వ్యర్థప్రాణ నైతిన్ గడున్.

ఎన్ని జననాంతరముల సాహిత్యబలమొ
ప్రోత్సహింపఁగ నీపదమ్ములను బడితి
ఎన్ని జననాంతరముల దుష్కృతబలంబొ
యెదురుపడ నీకు దూరమై యిట్టులైతి.

ధరణిపై నిట్టివెపరీత్యములు గలవె?
నామనసునందు పుట్టినప్రేమవిషము
న న్నుపేక్షించినది దారుణమ్ముగాఁగ
దివ్యలావణ్యమూర్తి! వధించె నిన్ను.

అంగజాకార! ప్రణయప్రసంగ మిట్లు
కలుగకుండిన నిట్టి యకాలమరణ
మునకు బలిగాకయుందువేమో?— బలిమిని
గెంటుకొని వచ్చె నిన్ను నా కంటితప్పు.

శ్రీకల్యాణనిధీ! భవత్పదములన్ సేవింపలేకుంటచే
నా కీజీవిత మున్నదయ్యు మొదలంటన్ లేనియట్లయ్యె— నా
శాకస్తున్త్యము నీదుజీవితము వృద్ధోపాసనాపూత మి
ట్లీ కష్టమ్మున భ్రష్టమయ్యెఁ గలదయ్యెన్ బ్రహ్మకల్పాంతమై.

పావన మైననాప్రణయభావము నీస్మృతిమాత్రచే వృథా
పోవదు— దుఃఖభారపరిపూరిత మీతనువుల్ త్యజించెదన్
నీవెనువెంట వచ్చెదను— నీకగులోకమె నాకుఁ గూడ నాఁ
గావుత నచ్చటం బడయఁగల్గెద నాప్రణయంపుసౌఖ్యమున్.

భర్తృదుఃఖార్త యైన యాపడఁతి యిట్లు
చిరము చింతించి తత్ప్రాంతసీమయందు
సుజ్వలిత మైనపతిచితిఁ జూచి యటకు
పరువులెత్తెను రాజు సంభ్రమమువడఁగ.

## శ్రావణము

సరయూనీరమునందు భక్తిమెయి సుస్నానంబు గావించుచున్
మెఱపుందీగయు వోలె వచ్చి చితిసామీప్యమ్మున న్నిల్చి స
త్వర మయ్యగ్నిఁ బ్రదక్షిణించి నిభృతధ్యానావబద్ధాత్మయై
యురికెన్ భర్తృచితాగ్ని నాలలన ప్రేమోద్రిక్తయై గొబ్బునన్.

హితముల్ పెక్కులు చెప్పి తత్స్మరణబుద్ధిన్ మాన్పఁగాఁ గోసల
క్షితినాథాగ్రణి వేయిరీతులను "త్రోక్కిళ్ళాడె"నే గాని యు
ద్ధతశోకాలస యైన కన్య తనయత్నం బింతయున్ మాన క
ద్భుతరీతిన్ బతితో సహానుగమనమ్ముం జేసె నాయగ్నిలో.

చేయునదిలేక దశరథక్షితివరుండు
ప్రాణహీనుల వృద్ధదంపతులఁ గూడఁ
గొడుకుఁ గోడలి మ్రింగిన ఘోరవహ్ని
నాహుతి యొనర్చె నపుడు మూఢాత్ముఁడగుచు.

మునుముం దాభువనైకమోహనకళామూర్తిన్ వటున్ మ్రింగి, యా
వెనుకం దత్సతి మ్రింగి, యావెనుక నే వృద్ధద్వయిన్ మ్రింగియా
యనలస్వామి ప్రశాంతుఁ డయ్యె— మృతకాయస్తోమమున్ మున్నువ
చ్చినయచ్చోటనె లీనమై చనఁగ నిల్చెన్ బూది పెన్రాశియై.

కడు నిర్విణ్ణుఁడు కోసలాధిపుఁడు కింకర్తవ్యతామూఢుఁడై
నడువంజాలక నిల్వలేక పడియుండన్ లేక యెట్టెటులో
జడ మట్లాచితిచెంతఁ గూలబడి లజ్జావ్యగ్రుఁడై నాఁటిదౌ
చెడుగుం జేఁతఁ దలంచి ఘోరముగ నేడ్చెన్ గుండియల్ వ్రీలఁగన్.

"హీనుఁడ! శబ్దవేధిశర మిందులకా పనివట్టి నేర్చినా
వీనడిరేయి గానలకు నిందులకా సనివట్టి వచ్చినా
వోనరపాలకాధమ! మహోజ్జ్వలదివ్యయశశ్ప్రపూర్ణమా
భానుకులమ్ము మంటఁగలుపన్ జనియించితిరా! కిరాతుఁడా!

విడిచినది యొక్క-శరమె తద్వికృతివలన
విడిచి రసువుల నల్వు రోజడుడ! నేఁడు
త్వత్ప్రయుక్తము దారుణాస్త్రంబు శబ్ద
వేధి గాదుర యది వంశభేదిగాని."

అనుచుం గొండొక యస్ఫుటస్వనము కర్ణాగ్రమ్ములన్ సోఁకిన
ట్లనిపింపన్ నృపమౌళి యుల్కి-పడె హా! హా! యంచుఁ— దచ్ఛబ్దమే
పునరావర్తిత మాచుఁ దోఁచె— నిఁక నాభూపాలుఁ డత్యంతదు
ర్మనసుం డుగ్రవిచారధర్షితుఁడు నున్మత్తుండు నై వెంటనే.

నాల్గుచావులకుం గారణమ్ము లైన
ఈకరమ్ములు కర్ణమ్ము లీయసువులు
నీశరీరము ధర నుండు టేల యింక
నంతయు సమాప్త మొనరింతు ననుచు నతఁడు.

కరవాలమ్మును జేతఁబట్టి శిరమున్ ఖండించుకోఁబూనున
త్తఱి స్నానార్థము పోవువాఁ డొకమునీంద్రస్వామి తద్బాధవా
చరణమ్మం బసివట్టి యాక్షణమ తత్సాన్నిధ్యముం జేరి త
త్కరముం గట్టిగఁ బట్టి యిట్లనియె నాత్సల్యంబు పెంపాఱఁగన్.

"ఇంతటిపిచ్చి నీకుఁ దగునే రఘువంశమహాబ్ధిచంద్ర! య
త్యంతపురాభవానుగతులై మృతులై చనినారు వారు— నీ
స్వాంతమునందు చింత విడువందగు, నింతకు వారు నేఁడు శా
తము నందిపోయిన మహాత్ములు నమ్ముము నాదుమాటలన్.

అది ప్రమాదముగాని నీయంత నీవు
కొట్టినది గాదు— దాన నేకొంచెమేని
తప్పు గలిగిన నది వృద్ధదత్తమైన
శాపమునఁ బోయె నింక దోషమ్ము లేదు.

ప్రకృతిహితముగ సాగరవలయిత మగు
ధారణీరాజ్యమేలి మాధవునికరుణ
పుత్త్రికులఁ గాంచి యశమును బొందఁగలవు
పొమ్ము చావఁగ నీ కేమి మునిఁగె నిపుడు?"

అనుచు దశరథునాత్మహత్యాప్రయత్న
మప్పు డాత్మోపదేశసామర్థ్యగరిమ
వెలయ విరమింపఁ జేసి దీవించి చనియె
చతురభాషణుఁ డగు తపశ్శాలి— యంత.

నృపతియు యుక్తియుక్తము మునిప్రవరోదితమైన బోధచే
నపగతశోకుఁడై మరణయత్నము మాని, గతంబులైన త
ద్విపదనుభూతులన్ వదలిపెట్టక యుండిన మానసమ్ముతో
నపు డొకపాటిగాఁ బెనగులాడి ప్రశాంతి గడించి పిమ్మటన్.

అప్పటికె వ్యోమమధ్యమ్ము నధివసించి
వెలయు రఘుకులదైవము విశ్వవంద్యు
కర్మసాక్షిని దా నెఱుంగక యొనర్చు
తప్పు సైపఁగ వేడి వందన మొనర్చి.

స్వాపరాధమ్మునన్ మృతు లైనవారి
యాత్మలకు శాంతిఁ జేకూర్ప నలఘుభక్తిఁ
జిరము ప్రార్థించి యింకఁ దత్సీమలందు
నిలువఁగ నశక్తుఁడై పయనించె నతఁడు.

గమనక్రియాఽశిక్షితము లట్లు లెంతయు
వడకు కాళ్ళను బిగబట్టుకొనుచు,
తనకుఁ దా భారమ ట్లనిపించు దేహమ్ము
నెట్లెట్లొ బలిమిమై యీడ్చుకొనుచు
శరశరాసనముల శరధుల భుజసమీ
కృతములఁ గడు నేవగించుకొనుచు
నిలుపఁగా రాని గుండియలయావేగంబు
చిరయత్నమున సరి జేసికొనుచు

విస్మయవిషాదభయసమావిష్టుఁ డగుచు
దారితప్పినయట్లు లున్మత్తుఁడట్లు
సంశయించుచు తూలుచు స్వనగరాభి
ముఖముగాఁ బోయె దశరథభూవరుండు.

# శ్రావణము

వన్యమ్ముల్ మృగపక్షిసంతతులు తత్ప్రాంతమ్ములన్ బొంచి సౌ
జన్యప్రేమనిబద్ధలోచనములై సర్వమ్ము నీక్షించి రా
జన్యుం డేఁగినవెన్క గుంపులుగ నాప్రాంతమ్మునం జేరి యా
ధన్యప్రాణుల కోస మేడ్చినవి కాంతారంబు మార్మ్రోయఁగన్.

"ఏతావద్విభవంబు దేహగతి— యిట్లే దేహి కర్మానుగుం
డై తత్తత్పరిణామముల్ వడయు విద్యాప్రాప్తిపర్యంత" మం
చాతిర్యగ్రుదితానుబంధముగ విఖ్యాతార్థగంభీరమై
స్ఫీతంబై యొకసుస్వనంబు వినిపించెన్ సర్వతోభద్రమై.

శ్రీ రామాయనమః

# శ్రావణము



## ఉత్తర ఖండము.



శివపూజకై పూల సవరించు మందార
వృక్షములో నిలువెల్ల విఱుగఁ బూసె
నందివర్ధనము లానందవర్ధనములై
యక్షదంపతుల కాహ్వాన మంపె
పారిజాతములు సుప్రసవసౌరభములఁ
దానమాడించె రోదస్స్థలంబు
మాకందములు చివురాకునోఁతలఁ బిక
జాతికిఁ బంక్తిభోజనము వెట్టె

ఎన్నఁడో పాఱిపోయినభృంగములును
చిలుకలును నేఁడు తమయిండ్లు చేరుకొనియె
సర్వసంపత్సుసంపన్న చైత్రరథము
చైత్రరథమయ్యె నంగజస్వామి కపుడు.

చిరవియోగంబు సంస్మృతిదూరమై మేను
లద్వైతభావమ్ము నధిగమింప
హృదయమ్ము దాఁటి పైకెగసిన ప్రణయంబు
స్మితరూపమునఁ గడుఁ జిందులాడ

శాకి వ ణ ము

అనివ ర్తనీయ మహా నన్యోన్యశుభదృష్టి
యనిమిషత్త్వైకసాక్ష్యమ్ము గాఁగ
రసికతాదీప్తి తొణికిసలాడ నవిరళ
నర్మభాషణధురీణత రహింప

భవ్యశృంగారసుభగ వైభవ సమృద్ధి
చైత్రరథసీమ నమృతవర్షమును గురియ
ఊర్వశీనలకూబరు లుజ్జ్వలాంగు
లామహోద్యానమందు ప్రత్యక్షమైరి.

"బ్రహ్మచారికిఁ జైత్రరథవీథి శృంగార
మనుభవింపఁగ ముచ్చటయ్యె నేఁడు"
"పరదాలలో మాటువడు రాచకన్నెకు
పరువులెత్తఁగ వీలు దొరకె నేఁడు"
పితృసేవకును మహోన్నతలోకసేవకు
స్వస్తిచెప్పితిరి గావలయు నేఁడు"
పితరులబ్రదుకు లేవిధమైన నేమాయె
కోరినమగఁడు చేకూరె నేఁడు

అనుచుఁ దమతమపూర్వవృత్తానుగతము
లైన పరిహాసముల సస్మితానుకూల
వచనరచనల నానందపారవశ్య
మినుమడింపఁగ వచ్చి రయ్యిరువు రటకు.

## ఉత్తరఖండము.

సుమములు కుసుమహారము లుపహారముల్
కురిసెను కోటానఁ గోట్లు గాఁగ
వల్లకీమధురనిస్వానబంధురముగా
నమరగానముల సంభ్రమము చెలఁగ
శుభమర్దలధ్వనిస్ఫూర్తిమై గంధర్వ
కృతములౌ నాట్యభంగిమము లొప్ప
అద్భుతకవితామృతాస్వాదరుచిరమై
జయజయస్వనవిశేషమ్ము దనరె

స్వాగతంబులు నభివందనాభినంద
నములు చెలరేఁగె శ్రవణసుందరము లగుచు
యక్షరాజన్యసుతుఁడు శాపాంత మంది
మఱలి వచ్చిన యా మేటితరుణమందు.

పరిచితుండగు రక్షకభటుఁ డొకండు
వచ్చి తొల్లిటి యనుభూతి భావమందు
గడలుకొన మెల్లఁగా దొడ తడవికొనుచు
ముసినగవు మీఱ వారికి మ్రొక్కి చనియె.

పెనుశాపమ్మునఁ దన్ను బాసి చని యుర్విన్ బ్రహ్మచర్యాశ్రమమ్మునఁ గష్టంబో సుఖంబో చేకొని యథాపూర్వంబుగా వచ్చు నా తనయుం జూడఁగ వచ్చి యక్షపతియున్ దద్వందితుం డౌచుఁ బ్రీతిని దీవించి కవుంగలించి చనె స్మేరాంకూరముల్ మీఱఁగన్.

## శాప వ ణ ము

మున్ను పితృశాప మెచట నిష్పన్నమయ్యె
నచట, నానందివర్ధనాభ్యంతికమున
యువతి యువకుఁడు నవనవాభ్యుదితభావ
లలితదరహాసవదనులై నిలిచి రంత.

నందివర్ధన ముపచితానంద మగుచు
నూఁగె నొకమాఱు — కురిసె సద్యోవిభిన్న
పుష్పవర్షము — తన్నవామోదకలిత
మలయపవనాంకురమ్ములు మలసె దెసల.

అమరెన్ బుష్పము లూర్వశీరుచిరకైశ్యంబందు — వెన్వెంటనే
యమరెన్ దీయనికోర్కి రాజతనయస్వాంతమ్మునన్ — దోడనే
యమరెన్ దత్పృథుబాహుశాఖలఁ దదీయాంగోల్లసద్వల్లి — నా
డమరెన్ విశ్వము వారలిద్దఱకు దివ్యానందసామ్రాజ్యమై.



# కుంతి

రచన: గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.

ఆవేదనాభరితమైన కుంతీజీవితము ప్రతిభాపూరితమగు స్త్రీమానసచిత్రణము. కర్ణరసాయనములగు పద్యములు. ఉత్తేజకములగు భావములు. ఆంధ్రయూనివర్సిటీ బి. యే., కు పఠనీయగ్రంథము. ఎన్నో పత్రికాప్రశంసలు, ఎన్నెన్నో పండితాభిప్రాయములు.

"ఈకావ్యంలోని కవిత్వం ఒక తేనె సెలలాంటిది. అది ఎప్పుడూ మధురంగా నిర్మలంగానే వుంటుంది. ఎప్పుడూ ప్రవహిస్తూనే ఉంటుంది ...ఈకావ్యం పాతకొత్తల కమ్మనిపాకము"— ఆలిండియా రేడియో, మదరాసు 24-7-51.

"ఆ యా శీర్షికలలో కుంతీజీవితములోని ప్రత్యేకఘట్టాలు మానసిక పరిస్థితులు వర్ణిస్తూ రచయిత సమగ్రకుంతీస్వరూపం పాఠకులకు కళ్లకుకట్టినట్లు చిత్రించారు...... ఈరోజుల్లో తెలుగులో కేవలం పద్యరచయితలు సుమారు రెండుమూడు వందలదాకా ఉన్నారు. వీరందరిలోనూ కవులనిపించుకోదగినవారు చాలాతక్కువే. కాని శ్రీ రామకృష్ణశాస్త్రిగారు ఎన్నదగిన ఈకవివర్గంలో ప్రత్యేకంగా పేర్కొనదగినవారు"...
'భారతి' డిశంబరు 1951.

"The poem is a recital of the essence of the story of Mahabharatha by Kunti in a style which is commendable. The verse which is all in long sanskrit metres is sonorous and dignified, exhibiting the poet's ability in putting into verse his ideas of Kunti and her life." The Hindu, Sunday, June 22, 1952.

"కవిత్వమునందలి పటుత్వము భావములయందలి గాంభీర్యమును శైలియందలి సంపదను చవిగొన నభిలషించు సారస్వతాభిమానులీకృతిచే కొంత తనివిజెందగలరని నా నమ్మకము." బెజవాడ రామచంద్రారెడ్డి.

"ఈయనవ్రాసినకావ్యము చిన్నది. కవితాశక్తి యసామాన్యమైనది. ఈకావ్యమునందు రెండుభిన్నశక్తుల సంయోగము కలదు. అవిరెండును సామాన్యముగా కలిసియుండవు. ఈరెంటికలయిక నన్నయగారిలో నున్నది. పెద్దనగారిలో నున్నది. తెలుగులో మఱియొక కవియందు కనిపించలేదు. ...ఇట్టిరచనచేసినవాఁడే కవి."

విశ్వనాథ సత్యనారాయణ.

"I congratulate you on your succes. Your interpretation of the checkered life of Kunti is bound to appeal to the Andhra public." C. R. Reddi.

ఇంకను పలువురు మహామహులచే ప్రశంసింపబడినది.

V. R. R. ... వెల రు 2—0—0

2-12-55 అరుణాశ్రమము,

2-3- నడకుదురు, కాకినాడ.

# అరుణాశ్రమ ప్రచురణములు.

---

కుంతి (పద్యకావ్యము) రు 2-0-0
(రామకృష్ణశాస్త్రి)

ఆంధ్రానందరామాయణము, అనువాదము,
(కీ. శే. గుండు లక్ష్మణశాస్త్రిగారు) రు 6-0-0

సింహగడము (చారిత్రిక మహానాటకము) రు 2-8-0
(సురభి నరసింహంగారు B. A., B. Ed.)

రా ను న్న వి

నీలకంఠ విజయము అనువాద ప్రబంధము.

మృచ్ఛకటికము అనువాద నాటకము.

అద్భుత దర్పణము " "

నా స్వామి

ము న్న గు న వి.

---

అరుణాశ్రమము, నడకుదురు, కాకినాడ.